# బొంబాయి అసెంబ్లీలో డాంగే

[బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గం ప్రవేశ పెట్టిన కార్మిక వ్యతిరేక చట్టాన్ని ఖండిస్తూ, వివిధ కార్మిక సమస్యల్ని గురించి, భారత కార్మికోద్యమ చరిత్రను గురించి, కామ్రేడ్ డాంగే ఇచ్చిన 6½ గంటల ఉపన్యాస సారాంశం]


అనువాదం

వాసిరెడ్డి భాస్కరరావు



ప్రజాశక్తి ప్రచురణాలయం

:: బెజవాడ ::

శాసనసభలో ఉన్న అన్ని వర్గాల సభ్యులు ఈ బిల్లును బలపరచాలని కార్మికశాఖామంత్రిగారు కోరారు. వారు కోరిన ప్రకారం ఈ బిల్లు అందరికీ అంగీకారంగా ఉంటే బాగానే ఉండేది. అలా లేకపోవడంవల్ల ఈ బిల్లును నేను బలపరచ జాలనందుకు విచారిస్తున్నాను. వెనుకటి బాంబే ఇండస్ట్రియల్ డిస్ప్యూట్స్ యాక్టు (బొంబాయి పారిశ్రామిక తగాయిదాల చట్టం) లో ఉన్న ప్రధాన లోపాలన్నీ ఈ బిల్లులోకూడా ఉన్నాయి, కాబట్టి నే నీ బిల్లును బలపరచ జాలను. వెనకటి బిల్లును రద్దుజేస్తూ ఈ బిల్లులో ఉన్న ఒకక్లాజును మాత్రం నేను హృదయపూర్వకంగా సమర్థిస్తున్నాను. కాని ప్రస్తుతం ఉన్న ఏర్పాట్లన్నీ ఆచట్టంక్రిందనే జరుగుతూ ఉంటాయి అనే విషయాన్ని మాత్రం నేను వ్యతి రేకిస్తాను. ఆ పూర్వపు బిల్లును పూర్తిగా రద్దుజేసివేస్తే మేము ఇప్పటికంటె ఎక్కువ హాయిగా సుఖంగా బ్రతుకుతాం. ఈ అభివృద్ధి నిరోధక చట్టాన్ని ప్యాసుచేయడం మానివేయండి. ఇందుకు బదులుగా ఎలాంటి తికమకలు లేని ఆచరణయోగ్యమైన ఒక మామూలు చట్టాన్ని ప్రవేశపెట్టండి. ఆ చట్టం ఎలా ఉండాలో తర్వాత సూచిస్తాను.

## బొంబాయి పారిశ్రామిక తగాయిదాచట్టం సమ్మెలను అణచడానికి ఉపయోగపడింది.

"బొంబాయి పారిశ్రామిక తగాదాల చట్టంలో అనేకలోపాలున్నాయని అంటున్నారు. కాని నిజానికి అందులో ఏ మాత్రం లోపం లేదు" అని కార్మిక శాఖామంత్రిగారు సెలవిస్తున్నారు ఆ బిల్లును తయారుచేయడంలో (వ్రాతలో) మాత్రం కొద్దిలోపాలున్నాయట! వాటిని ఇప్పుడు సరిదిద్దుతారట! కార్మిక శాఖామంత్రిగారు తమ ఉపన్యాసాన్ని ముగిస్తూ ఆ చట్టాన్ని వ్రాసి ఇచ్చిన వాని బుద్ధిబలాన్ని కొనియాడుతూ అతనికి అభివందనపరంపరలనందజేశారు. మంత్రి గారు మొదట చెప్పినదానికీ తర్వాత చెప్పినదానికీ సంబంధంలేదు. వారి ఉప న్యాసంలోనే స్వవచనవ్యాఘాతం ఉంది. ఔనుమరి! వారిక్రింద పనిజేసే సెక్రెటరీల బుద్ధిబలాన్ని వారు కొనియాడక తప్పుతుందా?

బొంబాయి పారిశ్రామిక తగాయిదాల చట్టం ఒక నిరర్థకమైన చట్టం. దానివల్ల కార్మికులకు ఏమాత్రం ఉపయోగం జరగలేదు. 1946 ఏప్రిల్ 25 వ తేదీన నేడు మన కార్మికశాఖా మంత్రిగా ఉన్న 'నందా' గారుకూడా ఈ విషయాన్ని అంగీకరించారు. కాని ఇప్పుడు ఆ మంత్రివర్యులే ఆ చట్టం ఎంతో సంతృప్తికరంగా పనిచేసింది అని సెలవిస్తున్నారు. (ఒకదాని కొకటి పరస్పర విరుద్ధం.) 1946 ఏప్రిల్‌లో బొంబాయి వస్త్రపరిశ్రమల్లో ఒక తీవ్రసంక్షోభం బయలుదేరింది. జీతాలు పెంచాలనీ, బోనస్ ఇవ్వాలనీ. అనేక మిల్లుల్లో పని జేస్తూ ఉన్న కార్మికు లందరు ఏకగ్రీవంగా కోరారు. నోటీసు లిచ్చారు. ఖాందేష్‌లోనూ. షోలాపూర్‌లోనుకూడా ఇలాగే జరిగింది. అహమ్మదాబాద్ కార్మికులుకూడా అలాటి నోటీసులే ఇస్తారనడంలో ఎట్టి సందేహమూ లేదు. ఇలాటి ప్రధాన సమస్యల్ని సాధించడానికి ఎటువంటి చట్టం ఉండాలి ? 5 లక్షల కార్మికులు తమ జీతాలు పెంచాలనీ, బోనసు ఇవ్వాలనీ ఏకగ్రీవంగా డిమాండ్ చేస్తూఉన్నారు. తగాదాల్ని పరిష్కారం చేయడానికి కార్మికుల ఇబ్బందుల్ని తొలగించడానికి, బొంబాయి పారిశ్రామిక తగాదాల చట్టం (బి ఇ డి. యాక్టు) తయారుచేయబడింది అని మీరు అంటున్నారు, కాని అసలు జరిగిందేమిటి ? ఆ చట్టంవల్ల కార్మికుల యిబ్బందులు తొలగుతాయా ? తగాదాలు పరిష్కారమయ్యాయా ? ఏప్రిల్ 25 వ తేదీన మంత్రివర్యులు (నందా) చేసిన ప్రకటననే ఉదహరిస్తాను.

"ఈ రాజీలు, రాయబారాలవల్ల సమస్యలు శాంతియుతంగా. సత్వరంగా పరిష్కారమయ్యే సూచన లేవీ లేవు. పరిస్థితులన్నీ జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత ప్రభుత్వం ఇదే నిర్ణయానికి వచ్చింది."

ఎనిమిది సంవత్సరాలనుంచి బి. ఇ. డి. యాక్టు ఏ విధంగా అమలు జరుపబడుతూ ఉందో చూచిన తర్వాత మన కార్మికశాఖా మంత్రిగారు తమ స్వానుభవాన్నిబట్టి పై నిర్ణయాన్ని వెల్లడించారు. ఈ బి. ఇ. డి. యాక్టు ఫలితంగానే ఇద్దరు కార్మికులు ప్రాణాల్ని కోల్పోయారు.

ఇది వట్టి నిరర్థకచట్టంఅని మేము, మొదటినుంచీ చెప్పుతూనేఉన్నాం. దీన్ని పూర్తిగా రద్దుచేయవలసిందని ఈ ఎనిమిది సంవత్సరాలనుంచి ఆందోళనజేస్తూనేఉన్నాం. మావాదన మొదటినుంచీసక్రమం, సహేతుకం అనిఈవిషయమే రుజువుచేస్తూఉంది. అయినప్పటికి మన మంత్రివర్యులు మాత్రం మేం చెప్పేసంగతులు యదార్థమైనవి కావని నేటికీ మమ్మల్ని నిందిస్తునేఉన్నారు.

కాని ఎంతనిందించినా, ఎన్నిజెప్పినా, ఆరుమాసాలక్రితం వారు ప్రకటించిన ప్రకటనే మావాదనను బలపరుస్తూఉంది. ఇవ్వాళవారు కాదంటేమాత్రం ఆ ప్రకటన ఏమవుతుంది ?

అందాకా ఎందుకు ? నేడు మన కార్మికశాఖా మంత్రిగారుచెప్పినమాటలే, మేం ఆనాడు చెప్పిన భవిష్యద్వాణి నిజమేనని నిరూపిస్తున్నాయి. ఈ నాడు మంత్రివర్యులు ప్రవేశపెడుతూన్న బిల్లులోని "ఆశయాలు కారణాలు" అనే భాగమే 8 సంవత్సరాలకుపూర్వం ప్యాసుజేసిన ఆబిల్లును ఖండిస్తున్నాయి. పెద్ద పెద్ద సమస్యల్ని ఎదుర్కోవాలన్నా, 14 కోట్ల పెట్టుబడిగలిగిన మిల్లుయజమానుల తాకిడికి తట్టుకోవాలన్నా, ఆవెనుకటిబిల్లువల్ల ఏమాత్రం ఉపయోగం లేదనేవిషయాన్ని మంత్రివర్యులే ఒప్పుకున్నారు. పోతే ఇక చిన్న చిన్న సమస్యలవిషయం ఏమిటి ? ఆ బి. ఐ డి. యాక్టువల్ల కార్మికులకు కొద్దిపాటి సౌకర్యాలైనా కలుగుతాయాఅంటే, అదికూడా హుళక్కే-అని మంత్రిగారే స్వయంగా అంగీకరిస్తున్నారు. అందువల్లనే కొత్తబిల్లులో లేబర్ కోర్టుల్ని సృష్టించారు. కొత్తబిల్లుయొక్క 'ఆశయాలు-కారణాలు' అనే స్టేట్ మెంటులో మంత్రిగారు ఇలా ప్రకటించారు.

"ఇటీవల అనేక సంవత్సరాలనుంచి జరుగుతూవున్న సమ్మెలు, మిల్లుల మూసివేతలను (లాకౌట్సు) పరిశీలించి చూస్తే చిన్న చిన్న సమస్యలమీదనే ఎక్కువభాగం పని ఆగిపోతూన్నట్లు తెలుస్తూఉంది. కార్మికుల ఇబ్బందుల్ని తొలగించడంలో ఆలస్యం జరుగుతూఉంది. ఒక పక్షంవారి వాదనకే ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడంవల్ల కార్మికులకు సమస్యాపరిష్కారంలో పక్షపాతం జరుగుతూఉంది. ఇందువల్ల కార్మికుల్లో అసంతృప్తి, ద్వేషం ప్రబలుతూ ఉన్నాయి. పరిశ్రమలు శాంతియుతంగా నడవడంలేదు. ఉత్పత్తి తగ్గిపోతూ ఉంది. కార్మికులు ఆర్థికంగా నష్టపడుతున్నారు."

"1938 యాక్టులో ఉన్న రాజీసూచనలు పారిశ్రామిక తగాదాల్ని పరిష్కరించడంల్లేదు యాక్టులో సూచించిన విధంగా రాజీరాయబారాలు జరపడంలో అనవసర కాలయాపన జరుగుతూవుంది. పోనీ, చివరకు ఫలితం. ఏమైనా తేలుతుందా అంటే అదీ సున్న."

పై ప్రకటనలోని మొదటిభాగం అంతా నందాగారి (బొంబాయి కార్మికశాఖా మంత్రి) స్వంత వేదాంతం మాత్రమే. రెండోభాగం బి. ఐ. డి. యాక్టుమీద వారిచ్చిన తీర్పు.

మొత్తంమీద తేలిన సారాంశమేమిటంటే ప్రధాన సమస్యల్ని బి. ఐ. డి యాక్టు త్వరగా పరిష్కరించలేదు. ఇక చిన్న సమస్యల్ని పరిష్కరించడానికో అది కేవలం నిరుపయోగం. పోతే ఇక దాని ఉపయోగమేమిటి? సమ్మెల్ని అరికట్టడానికి అది బాగా ఉపయోగపడుతుంది. ఇందుకు ఒక పరిష్కారకర్త ఉంటాడు. యల్. ఫారాలనీ, యమ్. ఫారాలనీ, నోటీసులనీ కాపలసినంత కర్మకాండ జరపాలి. అప్పటికీ కార్మికులు లొంగిరాకపోతే 'శాంతి భద్రతల్ని' కాపాడవలసిన బాధ్యత ఉండనే వుంది. (శాంతి భద్రతల్ని కాపాడడం అంటే ఏమిటో మన భారతీయులకు వేరే చెప్పనవసరం లేదు - అను)

అందువల్లనే నేను ఆ బి. ఐ. డి యాక్టును పూర్తిగా రద్దుజేయవలసిందని మొట్టమొదటే సూచించాను. అదొక్కటే సరియైన పరిష్కారమార్గం. కాని ఇందుకు మంత్రిగారు అంగీకరించడంలేదు. గత ఎనిమిది సంవత్సరాల అనుభవాన్ని మంత్రిగారు మరచిపోతున్నారు. 1946 ఏప్రిల్ 25 వ తేదీన వారు స్వయంగా ప్రకటించిన ప్రకటనను కూడా మరచిపోతున్నారు. ఈ కొత్త బిల్లును ప్రవేశపెడుతూ ఇప్పుడు చెప్పినమాటల్ని కూడా అప్పుడే మరచిపోతున్నారు.

నందా.— (కార్మిక శాఖా మంత్రి) గౌరవనీయులైన సభ్యులు నన్ను (నా మాటల్ని) మెలికలు త్రిప్పుతున్నారు.

డాంగే:— త్వరలోనే మిమ్మల్ని తిన్నగాఉండేటట్లు చేస్తాం.

ఈ పునాదులమీదనే మంత్రిగారు ఈ కొత్తబిల్లును తయారు జేశారు. ఈ విషయాన్ని వారే స్వయంగా అంగీకరించారు. పునాదులు ఒకటే అయితే ఫలితం కూడా ఒకటే అవుతుంది. అంటే ఇప్పుడు కొత్తగా ప్రవేశపెట్టిన బిల్లువల్లకూడా ఏ ఒక సమస్యా పరిష్కారం కాదు. సమ్మెల్ని అణచివేయడం మాత్రం జరుగుతుంది. ఇది నే సూచించే మొదటి సూచన.

ఇక 'మాటల్ని మెలికలు త్రిప్పి పెడర్థం తీయడం' అనే రెండో విషయానికి వస్తాను.

## కార్మికులకు వ్యతిరేకం - మిల్లు యజమానులకు అనుకూలం

బి. ఐ. డి. యాక్టుక్రింద అనేక పరిష్కారాలు జరిగాయి అనీ, అందువల్ల ఆ యాక్టు జయప్రదంగా పనిచేసింది అనీ మంత్రిసత్తములు సెలవిస్తున్నారు. పరిష్కారాలు జరిగిన మాట వాస్తవమే అని నేనూ అంగీకరిస్తాను.

కాని అవి జయప్రదంగా మాత్రం జరగలేదు. కార్మికులమీద నిర్బంధవిధానం అమలు జరుపబడింది. కార్మికులకు మరోగత్యంతరం లేకుండా చేశారు. ఆ చట్టం ప్రకారం జరపవలసిన కర్మకాండ అంతా జరపాలి. లేకపోతే 5 వేల మంది కార్మికులు జైళ్ళకైనా వెళ్ళాలి. ప్రతి చిన్నవిషయంలో కార్మికుల్ని అణచివేయడానికే ఆ చట్టం ఉపయోగపడింది. ఆ చట్టం కార్మికుల్ని కాళ్ళూ చేతులు కట్టివేసి యజమానుల కాళ్ళముందు పడవేసింది. ఆ చట్టంలో ఉన్న నిబంధనల్ని సరిగా పరిశీలిస్తే ఈ విషయం చక్కగా బోధపడుతుంది.

మన కార్మిక శాఖామంత్రిగారికి ఒక ప్రత్యేక వేదాంతం వుంది. మిల్లు కార్మికులకు మిల్లు యజమానులకు కూడా కొన్ని స్కేల్సు ఏర్పాటుచేయాలని ఆయన సిద్ధాంతం. కాని ఆచరణలో జరిగిందేమిటి? వారు తయారుచేసిన ఈ కొత్త చట్టంలోని స్కేల్సు కార్మికవర్గానికి పూర్తిగా వ్యతిరేకమైనవి. కార్మికుల యోగక్షేమాల్ని గురించి శ్రద్ధ తీసుకునేందుకు ఒక లేబర్ ఆఫీసరును నియమించారు. కాని యీ లేబర్ ఆఫీసరు ఎవరి యోగక్షేమాలకోసం పాటు బడతాడో మనకు త్వరలోనే తెలుస్తుంది అసలురంగుతో ఈ ఆఫీసరు కొద్ది లోనే బైటపడతాడు. నేను మంత్రిగారి మాటల్ని విరిచి పెడర్థం తీయడంలేదు సుమా! ఈ కొత్త చట్టంలో ఉన్న 14 వ నిబంధనను చూడండి. "ఈ కొత్త చట్టంప్రకారం ఉభయపక్షాల్లో (యజమానులు, కార్మికులు) ఏ ఒక పక్షంకోరినా సంప్రదింపుల్లో పాల్గొనేందుకు ప్రతినిధుల్ని ఎన్నుకోడానికి ఈ లేబర్ ఆఫీసరు కార్మికుల సమావేశం జరుపుతాడు. యజమానులు నోటీసిస్తే 14 వ నిబంధన ప్రకారం మూడు రోజుల్లోగా కార్మికుల్ని సమావేశపరచాలి. కార్మికులు నోటీసిస్తే 18 వ నిబంధన ప్రకారం లేబరు ఆఫీసరు తన ఇష్టంవచ్చినప్పుడు కార్మికుల్ని సమావేశపరుస్తాడు!" ఇందులో నా స్వంత మాట ఒక్కటికూడా లేదు. మంత్రిగారి మాటల్ని విరచటంలేదు. మంత్రిగారు తయారుచేసిన చట్టంలోని మాటల్నే తూచా తప్పకుండా ఉదహరించాను. మిల్లు యజమాని నోటీసిస్తే మూడురోజుల్లోగా తప్పకుండా కార్మికుల సమావేశం జరపాలట! కార్మికులు నోటీసిస్తే లేబరు ఆఫీసరు ఇష్టమట! అంటే లేబరు ఆఫీసరు మిల్లుయజమానుల ఏజెంటు అని వేరే చెప్పాలా?

నందా:— ఆరూల్సుని నేను తయారుచేయలేదు. కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా ఇచ్చినతర్వాత ఆరూల్సువచ్చి ఉంటాయి.

డాంగే.—మంత్రిగారు తమరూల్సును తామే మరచిపోయినందులకు నేను విచా

రిస్తున్నాను. 1939 మే 29 వ తేదీన ఆరూల్సు తయారు చేయ బడ్డాయి. 1939 అక్టోబరులో కాంగ్రెసుమంత్రివర్గం రాజీనామాఇచ్చింది. మంత్రిగారు దీన్ని కాదంటారా ? ఆ నిబంధనల కాపీ ఒకటి ఇప్పుడు నాచేతిలోనే ఉంది. బొంబాయి ప్రభుత్వ గెజెట్ దీన్ని ప్రకటించింది. అంతేకాని దీన్ని కమ్యూనిస్టు పార్టీవారి పీపుల్స్ పబ్లిషింగ్‌హౌస్ ప్రక టించలేదుసుమా !

మంత్రిగారికి ఈనాడున్న సిద్ధాంతాలే ఆనాడుకూడా ఉన్నాయి. ఆచట్టాన్ని వ్రాసేటప్పుడు బహుశా మంత్రిగారి స్వంతసెక్రటరీయే ఈకిటుకు చేసిఉంటాడు. మంత్రిగారిని మోసపుచ్చి ఉంటాడు. కాని ఇందుకు నేనేంచేయను? ఎలాగైతేనేం మీహయాంలోనే రూల్సు తయారయ్యాయి. అందువల్ల కార్మికులు నానాఅప స్థలూ పడ్డారు. 1941, 42, 43, 44 సంవత్సరాల్లో అనేక మిల్లుల్లో పనిచేస్తూ ఉన్న కార్మికులు నోటీసులిచ్చారు. కావాలంటే అందులో ఒక్కటికూడా వీరు పోకుండా ఆమిల్లులపేర్లన్నీ ఉదహరిస్తాను. లేబర్‌ఆఫీసరు నేటివరకు ఆ మిల్లుల్లో ఎన్నికలుజరిపిన పాపానపోలేదు. కార్మికశాఖా మంత్రిగారు దీన్ని కాదంటారా ? కావాలంటే తేదీలు, పేర్లు వరసగా ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను. 17 మిల్లులలో కార్మికులు నోటీసులిచ్చారు. కాని ఇంతవరకు ఎన్ని కలు జరుగలేదు. లేబర్ ఆఫీసరు 'ఇష్టం' అని కాంగ్రెసు మంత్రివర్గం చేసిన రూల్సుఫలితం ఇది.

పాతచట్టం మిల్లుయజమానులకు తోడ్పడింది. కార్మికుల్ని అణచివేయ డానికి బాగా ఉపయోగపడింది. ఆ పాతచట్టం పునాదులమీదనే నేడు మళ్ళీ ఒక కొత్తచట్టాన్ని నిర్మిస్తున్నారు, కాబట్టే జరిగిపోయిన ఆ పాతచట్టాన్ని గురించి నేనింత గట్టిగా నొక్కిచెప్పవలసివచ్చింది.

కార్మికుల యెడల ప్రభుత్వపాలసీ ఎలా ఉంటుందో కార్మికశాఖామంత్రి గారు తన స్టేట్‌మెంటులో ఉదహరించారు. వారి ప్రకటన మాత్రం చాలా బాగుంది; అనేక 'పవిత్ర' ఆశయాలు వెల్లడించారు; వేతనాలు, విద్య, వైద్యం వగైరా కార్మికులకు కావలసినవన్నీ చేసివేస్తామన్నారు. వారిచ్చిన వాగ్దానా లన్నిటినీ నేను అంగీకరిస్తాను. వారు చేసిన వాగ్దానాల నన్నింటినీ ముందు శాసనరూపంగా తయారుచేస్తే బాగుంటుంది, ముందు కార్మికు లకు కావలసిన సౌకర్యాలు కలుగజేసి, ఇక సమ్మెలు మానివేయండని సలహా లివ్వండి. కార్మికుల ఆకలిమంటను చల్లార్చి, వారికి కావలసిన సౌకర్యాలను

సమకూర్చి అప్పుడు తాపీగా యల్. ఫారాలు, యమ్. ఫారాలు వగైరా కర్మ కాండ అంతా జరపమనండి. అందుకు కార్మికులకేమీ అభ్యంతరంలేదు. కార్మిక శాఖామంత్రిగారు రెండుసార్లు ఈపదవి నలంకరించినప్పటికీ కార్మికుల ఇబ్బం దుల్ని తొలగించడానికి ఏమాత్రం కృషిచేయలేదు. ఈపదవిలో ఈసారి శాశ్వ తంగా ఉంటారు. (మొదటిసారి కాంగ్రెసుమంత్రులు 5 సంవత్సరాల గడువు పూర్తికాకముందే మధ్యనే రాజీనామాలిచ్చారు.)

ఒక సభ్యుడు:— మరి మీరో ?

డాంగే:— నేనుకూడా ఇక్కడ శాశ్వతంగానే ఉంటాను. ఇక్కడ కాకపోతే శాసనసభ బైట అయినా.

కార్మికులు అనేక బాధలకు గురి అగుతూఉన్నమాట నిజమే అని మంత్రిగారుకూడా అంగీకరిస్తున్నారు. అంతేకాని పైనుండి ఎవరో కుట్రలు పన్నడంవల్లనే ఎక్కువ భాగం సమ్మెలు జరుగుతున్నాయి అనే భావాన్ని వారు ప్రకటించలేదు. సమ్మెలు జరగాడానికి మూడు ప్రధాన కారణాలున్నాయి, అని వారు సూచించారు. వారు సూచించిన మూడు కారణాలు కార్మికుల కష్టా లకు సంబంధించినవే. సమ్మెల్ని గురించి కాంగ్రెసు వర్కింగ్ కమిటీకూడా ఇటీవల ఇలా ప్రకటించింది. "యుద్ధంవల్ల ఆర్థికవిధానం తారుమారయింది. జీవితావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి అందుబాటులో లేకపోవడం వల్ల కార్మికులు అనేకబాధలు అనుభవిస్తున్నారు. ఈ ఆర్థికకారణాకవల్లనే సమ్మెలు ఎక్కువగా వస్తూన్నాయి."

కాబట్టి ఈ సమ్మెలు ఆగిపోవాలి అంటె ముందు మంత్రిగారు జీవితావ సర వస్తువులధరలను తగ్గించాలి. సమ్మెలకుమూలకారణమైన ఆర్థికపరిస్థితుల్ని చక్కజేయాలి. కాని మన మంత్రిగారు మాత్రం కార్మికుల జీవిత పరిస్థితులు చక్కబడ్డా, చక్కబడకపోయినా, ముందు సమ్మెలు ఆపుచేయవలసిందే అని సెలవిస్తున్నారు. ఆయనకు కావాలసింది ముందు కార్మికుల ఆర్థికజీవితాన్ని బాగుచేయడం కాదు. సమ్మె లాపుచేయడమే ఆయన వినాదం. మంత్రిగారు ఈ పద్ధతినే అవలంబిస్తే మన రాష్ట్రంలో పరిశ్రమలు అభివృద్ధిచెందే అవకాశం లేకుండా పోతుంది. మనకు కావాలసింది మంత్రిగారి వ్యక్తిగత మంచితనం కాదు. ఆయన అవలంబిస్తూన్న పాలసీమీదనే కార్మికుల బాగోగులు ఆధారపడి ఉంటాయి. నేడు మన మంత్రిగారు అవలంబిస్తూఉన్న పాలసీ అత్యంత ప్రమాద పరిస్థితులకు దారితీస్తుంది. ఇప్పటికైనా కాంగ్రెసు వర్కింగు కమిటీ

సూచనల ననుసరించి సమ్మెలకు మూలకారణమైన ఆర్థికపరిస్థితుల్ని బాగుచేయ డానికి ప్రయత్నించండి. కమ్యూనిస్టులే సమ్మెల్ని రెచ్చకొడుతున్నారనడం శుద్ధతప్పు. ఒకవేళ నేనుకూడా కాంగ్రెసులోనే చేరినప్పటికీ ఈ సమ్మెల వెల్లువ మాత్రం ఆగదు.

డాక్టరు అంత్రోలికర్ :—మీరు కాంగ్రెసులో చేరడానికి వీల్లేదు.

డాంగే :—మీరు మీ సంస్థలో ఉన్న ప్రజాస్వామిక సూత్రాల్నికూడా ఎరగరు!

అంత్రోలికర్ :—సూత్రాలు ఎలా ఉంటే ఏం? మా అనుభవాన్నిబట్టి మాత్రం మిమ్మల్ని కాంగ్రెసులో చేర్చుకోం,

డాంగే :— మీ పార్టీనాయకులు మిమ్మల్ని కొంచెం అదుపులో ఉంచుతారని ఆశిస్తాను.

స్పీకర్ :—ఆర్డర్, ఆర్డర్. గౌరవనీయ సభ్యులైన డాంగేగారి సంభాషణలో ఇతరులెవ్వరూ మధ్య జోక్యం కలిగించుకోరాదు. డాంగేగారిని మాట్లాడ నివ్వండి.

డాంగే :—మధ్యమధ్య 'ప్రతిభావంతులు' కలిగించే అవాంతరాల్ని నేసనలు లెక్కచేయనులేండి!

బి. ఐ డి. యాక్టు ఒక్క వస్త్రపరిశ్రమమీదనే ఉపయోగించబడింది. ఇప్పుడీకొత్తచట్టంకూడా ప్రస్తుతం ఒక్క వస్త్రపరిశ్రమ వరకే వర్తించబడు తుంది. మంత్రిగారు సెలవిచ్చినట్లు ఇది సర్వోత్తమమైన చట్టమే అయితే ఇంతమంచి చట్టాన్ని ఒక్క వస్త్రపరిశ్రమకే ఎందుకుపయోగించాలి? మిగతా పరిశ్రమలకుకూడా దీన్ని ఎందుకువర్తింపజేయగూడదు? టెక్స్టైల్ కార్మి కోద్యమం బలవత్తరంగా ఉందికాబట్టి దాన్ని నాశనంచేయడానికే బుద్ధిపూర్వకంగా ఈ చట్టం తయారుచేయబడిందని నేను అభిప్రాయపడుతున్నాను. బి. ఐ. డి. యాక్టు 1939 ఫిబ్రవరిలో ప్యాసైనప్పటినుంచి 1939 అక్టోబరులో కాంగ్రెసు మంత్రులు రాజీనామాలిచ్చినంతవరకు, 1946 ఏప్రిల్‌లో మళ్ళీ కాంగ్రెసు మంత్రి వర్గం ఏర్పడినప్పటినుంచి నేటివరకు, ఎప్పుడూకూడా ఈచట్టం వస్త్రపరిశ్రమల్ని మినహాయించి మరే యితర పరిశ్రమకు వర్తింపచేయలేదు. టెక్స్టయిల్ మిల్లుయజమానులే తమ స్వార్థంకోసం కాంగ్రెసు మంత్రుల్ని ఒత్తిడిచేసి యీ కార్మికవ్యతిరేక చట్టాన్ని ప్యాస్ చేయించగలిగారు.

జీవితావసరవస్తువుల ధరలు నూటికి 24 వంతుల చొప్పున పెరిగాయి. కాని అహమదాబాద్ వస్త్రపరిశ్రమల్లో పనిచేసే కార్మికుల జీతాలుమాత్రం పెరగ

లేదని జడ్జి ఛాగ్లాగారు తనఅభిప్రాయాన్ని వెలిబుచ్చారు. లేబర్ మంత్రిగారి లేబర్ఆఫీసు సమీకరించిన లెఖ్కల్నిబట్టే వారీవిధంగా ప్రకటించారు. ఇక ఈ లేబర్ఆఫీసు ఎంతచక్కగా పనిచేస్తూఉందో చూడండి. ఈ ఆఫీసు ప్రకటించిన లెక్కలు నూటికి 76 పాళ్ళు తప్పుఅని 1940 లో కన్సిలియేషన్ బోర్డు సభ్యులే స్వయంగా ప్రకటించారు. లేబరు ఆఫీసుకు లభించిన ఈ 'సర్టిఫికెట్' కన్సిలియేషన్‌బోర్డు రిపోర్టులోకూడా ముద్రించబడింది. సరే ప్రస్తుతం లేబర్ఆఫీసు ప్రకటించిన లెక్కల్నే ఆధారంగా తీసుకుందాం; జీవితావసర వస్తువుల ధరలతోపాటు జీతాలుకూడా వెంటనే పెంచాలని కోరుతున్నాను. కార్మికశాఖా మంత్రిగారు తాము ప్రకటించిన ప్రకటనలైనా అమల్లో పెడతారని ఆశిస్తున్నాను. జీవితావసర వస్తువుల ధరలు పెరిగాయనే విషయం అందరూ అంగికరిస్తున్నప్పుడు వాటితోపాటు కార్మికుల జీతాలుకూడా పెంచడానికి ఇంకా ఈ యల్. ఫారమ్సు. యమ్. ఫారమ్సు వగైరా కర్మకాండంతా జరపడం ఎందుకు ?

## సమ్మెలు ఎందుకు వస్తున్నాయి?

నందా .—బొంబాయిలో ధరలు పెరగడంతోపాటు వాటికి సమానంగా జీతాలు కూడా పెరగడం ఎప్పుడైనా జరిగిందా ?

డాంగే :—పెరగలేదనే చెప్పుతున్నా. ధరలతోపాటు జీతాలుకూడా సమానంగా పెరగాలనే నావాదన.

నందా :— అయితే ఇంకేం ? సమ్మెలు చేయించండి ?

డాంగే :— సమ్మెలు నేనే రెచ్చగొడుతున్నాననీ, ఇప్పుడు జరుగుతూవున్న సమ్మెలన్నిటికీ కమ్యూనిస్టులే బాధ్యులు అనీ మీరు నామీద నేరం ఆరోపిస్తున్నారు. కమ్యూనిస్టులు లేకపోతే సమ్మెలే జరగవని మీ అభిప్రాయం కాబోలు. సమ్మెలెందుకు చేయించలేదని 'గౌరవనీయులైన' కార్మిక శాఖామంత్రిగారు నామీద కంప్లెయింటు చేస్తున్నారు. మంత్రిగారు కూడా - కనీసం కొద్దికాలమయినా - ఒకప్పుడు సమ్మెలు చేయించినందుకు నేను సంతోషిస్తున్నాను.

"కార్మికుల జీతాలు హెచ్చిస్తే ధరలు పెరుగుతాయి" కాబట్టి కార్మికుల జీతాలు హెచ్చించచగూడదని మంత్రిగారు ఒక కొత్త సిద్ధాంతాన్ని సృష్టించారు. వారి సిద్ధాంత ప్రకారం జీతాలు హెచ్చిస్తే ధరలు పెరుగుతాయి. అందువల్ల

సమాజం నష్టపడుతుంది. కాబట్టి జీవితావసర వస్తువుల ధరలు పెరిగినా సరే, కార్మికుల జీతాలుమాత్రం పెంచగూడదని వారి పాలసీ.

నందా :— 'వేతనాల పాలసీ'ని గురించి మనం ఇక్కడ చర్చించడంలేదు. నా పాలసీ అని ఇప్పుడు మీరు జెప్పినవిషయం అసలు నా పాలసీ కానే కాదు.

డాంగే :— మీరిచ్చిన స్టేటుమెంటునే తీసుకొని నేను మాట్లాడుతున్నాను. అది మీ పాలసీకాదని మీరిప్పుడు సెలవిచ్చినందుకు సంతోషం. సరే, ఇంకేం ? అలా అయితే ధరల పెరుగుదలతోపాటు జీతాలుకూడా వెంటనే పెంచమని కోరుతున్నాను. కార్మికుల జీతాలు పెంచి, వారికి కావలసిన సౌకర్యాలు కలుగజేస్తే సమ్మెలే జరుగవు.

ఇందుకోసం మంత్రిగారు కొంత కృషిచేయక పోలేదు కాని మిల్లు యజమానులు ఇందుకు పూర్తిగా అభ్యంతరాలు కలిగించారు. ఛాలెంజి చేశారు. అవును ! మిల్లుయజమానులు ఎందుకు ఛాలెంజి చేయరు ? వాళ్లు తప్పకుండా అభ్యంతరాలు కలిగిస్తారని అందరూ మొదట అనుకున్న విషయమే. మన కార్మికశాఖామంత్రిగారే ఏప్రిల్‌లో ఒక ప్రధానమైన పారిశ్రామిక తగాదాలో తీర్పు చెప్పవలసిందని ఇండస్ట్రియల్ కోర్టును కోరారు. కాని సెప్టెంబరువరకూ ఈ విషయంలో కోర్టువారు ఎటువంటి చర్యాతీసుకోలేదు ఏవేవో పనికిమాలిన అభ్యంతరాలు జెప్పుతూ కాలయాపనచేశారు. ఇంత కాలయాపనజేసి చివరకు ఈ కోర్టువారిచ్చిన ఉత్తరువులేమిటి ? కార్మికులు లేబరు ఆఫీసరుద్వారా తమ కష్టాల్ని నివేదించుకోవాలట ! ఎవరు ఈ లేబరు ఆఫీసరు ? మిల్లుయజమానుల చేతుల్లో ఇతనొక కీలుబొమ్మ. ఒక పారిశ్రామిక తగాదాలో ఇటీవలనే ఈలేబరు ఆఫీసరు విచారణచేశాడు. ఈ విచారణకు సంబంధించిన రికార్డులో మిల్లుయజమాని రాసిన ఒక ఉత్తరంకూడా ఉంది; మిల్లుయజమాని చెప్పుచేతల్లో 'దాసోహం' అనుకుంటూ లేబరు ఆఫీసరు ఏవిధంగా నడుచుకున్నాడో ఆ ఉత్తరంలో స్పష్టంగా ఉంది. మిల్లుయజమానుల అడుగులకు మడుగులొత్తే ఈ లేబరు ఆఫీసరు తీర్పువల్ల కార్మికవర్గానికి కలిగే ఫలితమేమిటి ? పోనీ, ఆతీర్పునైనా త్వరగా చెప్పుతాడా ? తన ఇష్టం వచ్చినట్లు వాయిదాలమీద వాయిదాలువేసి కాలయాపనచేస్తూ ఉంటాడు. ఈ వాయిదాలతో విసిగి వేసారి కార్మికులు సమ్మె సాగిస్తే దాన్ని అక్రమ సమ్మె(ఇల్లీగల్ స్ట్రయిక్)అంటారు. 'శాంతి భద్రతల'

సాకుతో 'గౌరవనీయులైన' మంత్రిగారు పోలీసు పటాలంతో ప్రత్యక్ష మవుతారు.

మిల్లు యజమానులకు కార్మికులకు మధ్య వచ్చే పారిశ్రామిక తగాదాల్ని త్వరగా పరిష్కారం చేయడమే ఈ బిల్లుయొక్క ఉద్దేశం. కాని ఆచరణలో జరుగుతూ ఉన్నదేమిటి? మిల్లు యజమానులు కోరితే లేబరు ఆఫీసరు మూడు రోజుల్లోనే కావాలిసిన పని అంతా పూర్తిచేసి వేస్తాడు. కాని కార్మికులు కోరితేనో, అదే పని ఆరుసంవత్సరాలకు కూడా పూర్తిగాదు. పారిశ్రామిక తగాదాలు త్వరగానే పరిష్కరింపబడుతున్నా యనీ, ఇప్పటివరకూ జరిగిన పరిష్కారాలు సగటున 22 రోజులకంటె ఎక్కువపట్టలేదనీ మంత్రిగారు సెలవిస్తూ ఉన్నారు. కాని అనేక తగాదాల్లో అసలు ఎన్నికలే జరగలేదు. కన్సీలియేషన్ బోర్డు ముందుకు అసలు యీతగాదాలు రానేలేదు. ఇలాంటి తగాదాల పరిష్కారంలో సంవత్సరాల తరబడి ఆలస్యం అయింది. అవన్నీ కలిసి సగటున లెక్కవేస్తే తగాదాల పరిష్కారం ఎంతకాలానికి జరుగుతుందో అప్పుడు తెలుస్తుంది. బహుశా తమ దృష్టిలో ఈ తగాదాలన్నీ బహు స్వల్పవిషయాలుగా కనిపిస్తున్నాయి కాబోలు!

నందా :— అలాంటి తగాదాలు మొత్తం ఎన్ని ఉంటాయి?

డాంగే :— వాటి జాబితా అంతా నా దగ్గిర సిద్ధంగానే ఉంది. ఇప్పుడు మీ రడిగిన ఈ ప్రశ్నవల్ల అసలు అలాటి తగాదాలు కూడా ఉన్నాయి అనే విషయం మీరు కూడా అంగీకరించినట్లే గదా?

నందా :— అవును, అలాంటి తగాదాలు కూడా ఉన్నాయి.

డాంగే ;—అలాంటి తగాదాలు ఉన్నాయి అని ఒప్పుకుంటే చాలు. అదే నాకు కావాలిసింది. నాజాబితాలో ఒకటీ అర ఎక్కువున్నా తక్కువున్నా నా వాదన.కేమీ అభ్యంతరం కలిగించదు. లెక్కలన్నీ కరెక్టుగా ఉంచుకుంటానికి నేనేమీ లేబరు ఆఫీసును గాదు. లేబరు ఆఫీసు లెక్కలుకూడా వట్టి తప్పులతడకలే.

ఆ చట్టం చిన్న సమస్యల్నికానీ, పెద్ద సమస్యల్నికానీ, దేన్నీ పరిష్కరించలేదు. ఆ చట్టాన్ని ప్యాసుచేసేటప్పుడు మేము చెప్పిన జోస్యం ప్రకారం తర్వాత జరగలేదు, కాబట్టి ఈ బిల్లును గురించికూడా ఇప్పుడు మేము చెప్పేదంతా తప్పే అని మంత్రిగారు సెలవిచ్చారు. కాని అసలు జరిగిం

దేమిటి ? పాత చట్టాన్ని గురించి మొదట మేమెంత చెప్పామో అంతా జరిగి తీరింది. మేము చెప్పేది ఎప్పుడైనా జరిగితీరుతుంది.

## బొంబాయి పారిశ్రామిక తగాయిదా చట్టంవల్ల కార్మికోద్యమం ముందుకు పోయిందా

ఇక బి. ఐ. డి. యాక్టు ఫలితంగా కార్మికోద్యమంలో ఎటువంటి మార్పులు వచ్చాయో కొంచెం పరిశీలిస్తాను. ఈ చట్టంవల్ల కార్మికోద్యమం ఎంతో అభివృద్ధిచెందింది, అని మంత్రిగారు ధైర్యంగా చెప్పారు. ఇందుకు నిదర్శనంగా ఈ చట్టంక్రింద 9 యూనియన్లు రిజిష్టరయ్యాయి అనికూడా సెలవిచ్చారు ఈ తొమ్మిది యూనియన్లలో మంత్రిగారి అహమదాబాద్ మజ్దూర్ మహాజన్ యూనియన్ (పోటీసంఘం) కూడా ఒకటి. ఈ చట్టంవల్లనే తమ సంఘం బలపడింది అని మంత్రిగారు చెప్పగలరా ? లేక ఈ చట్టం రాక పూర్వమే ఆ సంఘం బలపడిఉందా ?

సందా :—ఈచట్టం వచ్చినతర్వాత మా యూనియన్ సభ్యత్వం రెట్టింపు పెరిగింది.

డాంగే :—ఈచట్టంవల్లనే సభ్యత్వం పెరిగిందా ? ఈచట్టం రావడంవల్లనే పెరిగిందని వారి అభిప్రాయం. అవును తప్పకుండా అలాగే అయి వుంటుంది. ఈచట్టం వచ్చినతర్వాతకూడా ఏదైనా ఒక యూనియన్ బలపడలేదంటే అందుకుకారణం తప్పకుండా మాబోటి చెడ్డమనుష్యులే అయివుంటారు !

మంత్రిగారు చెప్పిన తొమ్మిది యూనియనులలో అమల్నేర్, ధులియా, జల్గాంవ్ యూనియన్లుకూడా ఉన్నాయి. ఈచట్టం రాకపూర్వమే పైయూనియన్లు ఎంతో బలంగా ఉన్నాయి. ఈచట్టం వచ్చినతర్వాత పైయూనియన్లకు 'రిప్రెజెంటేటివ్' (ప్రాతినిధ్యంగల) అనే ఒకతోక తగిలించడం మినహా కలిగిన ఫలితం ఏమీలేదు. ఈచట్టం ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి బలం చేకూర్చకపోగా పైపెచ్చు వాటి అభివృద్ధికి నిరోధాలు కలిగించింది.

ఉదాహరణకు బొంబాయినే తీసుకుందాం. బొంబాయిలో కార్మికోద్యమం బలపడడానికి పైచట్టం తోడ్పడిందా ?

బొంబాయి టెక్స్టైల్ కార్మికులు కార్మికోద్యమంలో కాకలుదీరిన మంచి ఉత్సాహవంతులు. ఈకార్మికులే తమ కార్మికోద్యమంద్వారా మొట్టమొదటసారి

మిల్లుయజమానుల్ని లొంగదీయగలిగారు. ఇవ్వాళ్ళ ఉదయం (మత) కల హాల్ని గురించి మాట్లాడుతూ ప్రధానమంత్రిగారు తాను బొంబాయి పౌరుడ నైనందుకు గర్విస్తున్నానని చెప్పాడు. నేనుకూడా ఒక బొంబాయి పౌరుడనైనం దుకు గర్విస్తున్నాను. ముఖ్యంగా బొంబాయి టెక్స్టైల్ వర్కర్సునుజూచి నేనెంతో గర్వపడుతున్నాను. ఈకార్మికులే మొట్టమొదటిసారి మిల్లుయజమా నుల్ని పోరాటంలో లొంగదీయగలిగారు. న్యాయసమ్మతమైన తమహక్కుల్ని పొందగలిగారు. కార్మికుల ఐక్యశక్తిముందు తట్టుకోలేక మిల్లు యజమానులు బొంబాయినుంచి గ్వాలియర్, ఉజ్జయిని, రత్లాం వగైరా ప్రదేశాలకు పరుగు పుచ్చుకున్నారు. కాని కార్మికులు యజమానుల్ని వదలిపెట్టలేదు. యజమాన్లు వెళ్ళిన ప్రతిచోటికీ కార్మికులుకూడా వెళ్ళారు. యజమానులతో పోరాడారు. గెల్చారు. ఎటుచూచినా యజమానులకు బొంబాయి కార్మికులే ప్రత్యక్ష మయ్యారు. ఎక్కడకు వెళ్ళినా బొంబాయి కార్మికులనుంచి యజమానులు తప్పించుకో లేకపోయారు. అందువల్లనే బొంబాయి కార్మికులు తమకు ఇబ్బందులు కలుగజేస్తున్నారని యజమానులు గొంతులు చించుకుంటూ కేకలు వేస్తున్నారు.

కార్మికోద్యమం యింత అభివృద్ధిచెందిన బొంబాయిలో ఒక్క రిప్ర జెంటేటివ్ యూనియన్ కూడా లేదు. షోలాపూర్‌లోకూడా యింతే. ఈ ప్రదే శాల్లో కార్మికోద్యమం ఈ విధంగా ఎలా బలపడింది? మీరు ప్రవేశపెట్టిన చట్టంవల్లనా? లేక మాబోటి 'చెడ్డ' మనుష్యుల కృషి ఫలితంగానా?

ఆ చట్టంక్రిందనే మా బొంబాయి గిర్నీకామ్‌గార్ యూనియన్‌కూడా రిప్రజెంటేటివ్ యూనియన్‌గా చేరాలనుకుంది. ఇంతలోనే మిల్లు యజమా నులు బొంబాయి ప్రభుత్వంతో గుసగుసలాడారు. బొంబాయి ప్రభుత్వం వెంటనే మమ్మల్ని అందర్ని అరెస్టుచేసింది. ఈ చట్టం అమల్లోవున్నా మా యూని యన్ సభ్యత్వం తగ్గిపోయింది. బొంబాయి గిర్నీకామ్‌గార్ యూనియన్ చరి త్రలో ఈ విధంగా రెండుసార్లు జరిగింది. తర్వాత సదరు యూనియన్ సభ్యత్వం విపరీతంగా అభివృద్ధిచెందింది. 1928 లో బొంబాయిలోఉన్న మొత్తం టెక్స్టైల్‌వర్కర్సు 1,18,000 అయితే ఒక్క మా గిర్నీకామ్‌గార్ యూని యన్ సభ్యత్వమే 80,000 ఉంది.

సక్లత్‌వాలా:— (మిల్లుయజమానుల ప్రతినిధి) అవును నిజమే.

డాంగే:— కార్మికోద్యమం ఇంత విపరీతంగా అభివృద్ధిచెందిన ఆ రోజుల్లో

ఈ బి. ఐ. డి. యాక్టులేదు. తర్వాత (చరిత్రాత్మకమైన) మీరట్ కేసు నడిచింది. తత్ఫలితంగా యూనియన్ మళ్ళీ దెబ్బతినిపోయింది. కాబట్టి కార్మికోద్యమాభివృద్ధిని ఎవరు నిరోధించింది? మా సిద్ధాంతాలా? మా సిద్ధాంతాలే అభివృద్ధిని అరికట్టాయి అని మంత్రిగారు సెలవిచ్చారు. కాని అది నిజంకాదు. నిరంకుశాధికారవర్గం అవలంబించిన దమన విధానమే కార్మికోద్యమాన్ని దెబ్బగొట్టింది. దీన్ని అవకాశంగా తీసు కొని మా వ్యతిరేకులు మేము పెద్ద పెద్ద సంఘాల్ని నిర్మించలేమని మా మీద ప్రచారం చేశారు. బ్రిటిష్‌ప్రభుత్వం మమ్మల్ని అణచివేయ డానికి తీవ్ర హింసాపద్ధతుల నవలంబించింది.

డాక్టర్ అంత్రోలికర్:— అప్పుడు బ్రిటిష్ ప్రభువులు మీ మిత్రులుగారా?

డాంగే:— నేను 1928-29 నాటి విషయాల్ని గురించి మాట్లాడుతున్నాను. 'గౌరవనీయులైన' సభ్యులకు ఏమాత్రం చరిత్రజ్ఞానం లేనందుకు నేను విచారిస్తున్నాను. తర్వాత తరగతులుబెట్టి ఆయనకు చరిత్ర బోధిస్తాను.

ప్రభుత్వ దమనవిధానం అతిదారుణంగా కొనసాగుతూ ఉండడంచేత బొంబాయిలో బలమైన యూనియన్ ఏర్పడలేదు. షోలాపూర్‌లోకూడా అదే పరిస్థితి. అమల్నేర్‌లో ఒకరిప్రెజెంటేటివ్ యూనియన్ ఉంది. కాని ప్రభుత్వం ఆ యూనియన్ను అణచివేయడానికి తీ వ్ర ము గా ప్రయత్నించింది. ఎప్పటి చరిత్ర నప్పుడే మరచిపోయే గౌరవనీయులైన సభ్యులకు తప్ప ప్రజ లందరికి ఇది మొన్నమొన్న జరిగిన విషయమే అని బాగా తెలుసును.

బి. ఐ. డి. యాక్టు ఈ రాష్ట్రంలో ఉన్న టెక్స్‌టైల్ యూనియన్లకు మినహా మరే ఇతర పరిశ్రమలకు వర్తింపజేయలేదు. ఈ చట్టంవల్లనే వస్త్రపరి శ్రమలు అభివృద్ధిజెందాయి అని మంత్రిగారు సెలవిచ్చారు. అంటే ఇందులో ఉన్న అంతరార్థం ఏమిటి? వస్త్రపరిశ్రమల్లో తప్ప తదితర పరిశ్రమల్లో యూని యనులు అభివృద్ధి చెందలేదన్నమాట! బి. ఐ. డి. యాక్టులేని ఇతర రాష్ట్రాల్లో కార్మికోద్యమం బలపడలేదన్నమాట! ఇదే మంత్రిగారి అభిప్రాయం, కాని అసలు జరిగిందేమిటి? దేశమంతటా కార్మికోద్యమం పూర్వంకంటె చాలా అభివృద్ధిచెందింది. కార్మికులు నిర్మాణయుతంగా పనిచేయసాగారు. ఉదాహర ణకు ఒక్క విషయం చూడండి. 1928-29 లో అఖిల భారత ట్రేడ్‌యూనియన్ సభ్యత్వం 1 లక్ష 81 వేలు. కాని 1929-30 లో సభ్యత్వం 2 లక్షల 42 వేలకు

పెరిగింది. ఒక్క సంవత్సరంలో సభ్యత్వం ఈవిధంగా పెరిగింది అంటే అప్పుడు బి. ఐ. డీ చట్టం ఉందా?

నందా :—మీ రుదహరించిన అంకెలు నిజమైనవికావు. కేవలం కల్పితం.

డాంగే :— (ప్రభుత్వంవారి) లేబర్ గెజెట్ నుంచే నే నీ అంకెల్ని ఉదహరిస్తున్నాను.

నందా .—1926 ట్రేడ్‌యూనియన్ యాక్టుక్రింద తయారుజేసిన సభ్యత్వసంఖ్య నమ్మదగినది కాదు. అప్పుడు సభ్యత్వ రిజిష్టరులను పరిశీలించడం జరగలేదు. బి. ఐ, డి. యాక్టుక్రింద తయారుజేసిన అంకెలు మాత్రమే నమ్మదగినవి.

డాంగే :—అయితే మీరుకూడా 1926 చట్టంక్రింద తయారుజేసిన అంకెలనే ఎందుకు ఉదహరించారు. మీ రుదహరించిన మజ్దూర్ మహాజన్ (పోటీ సంఘం) సభ్యత్వ సంఖ్యకూడా వట్టి అబద్ధమే అన్నమాట!

మొత్తంమీద ట్రేడ్ యూనియన్ సభ్యత్వం అన్ని ప్రదేశాల్లో రోజు రోజుకూ పెరుగుతూ ఉంది.

అఖిల భారత ట్రేడ్‌యూనియన్ సభ్యత్వం

| | | |
|---|---|---|
| 1936 — 37 లో | .... | 2,61,000 |
| 1937 — 38 ,, | .... | 3,90,000 |
| 1939 — 40 ,, | .... | 5,11 800 |
| 1942 — 43 ,, | .... | 6,85,000 |

ఈ అభివృద్ధి బి, ఐ. డి. యాక్టు వల్లనే రాలేదు. అసలు కార్మికోద్యమమే బలపడుతూ ఉంది. కార్మికుల్లో సంఘచైతన్యం నానాటికి అభివృద్ధి చెందుతూ ఉంది. బొంబాయిలో కార్మికోద్యమం బలహీనపడింది అంటే ఇందుకు కారణం ఈ బి. ఐ. డి చట్టమే.

ఇక అక్రమ (ఇల్లీగల్) సమ్మెల్ని గురించి మాట్లాడతాను. ఈ 'అక్రమ సమ్మెలు' అనే మాట 1938 తర్వాతనే తయారయింది. 1938 కి పూర్వం కూడా సమ్మెలున్నాయి. కాని 'అక్రమ' సమ్మెలంటూ లేవు. దీనికి కారణమేమిటి? 1938 తర్వాత కమ్యూనిస్టులనే ఒకప్రత్యేక మలా 'అక్రమ' సమ్మెల్ని రెచ్చగొట్టాలని నిర్ణయించుకున్నారట! కాని అసలు జరిగిన వాస్తవమేమిటి? 1938 లో బి. ఐ. డి. యాక్టు రాకపూర్వం యల్. ఫారమ్సు, యమ్. ఫారమ్సు గొడవేమీ లేదు. ఆ పనికిమాలిన కర్మకాండ అంతా జరిప

కుండా కార్మికులు సమ్మెలు జేసినా అప్పుడు వాటిని 'అక్రమ' సమ్మె లనేవాళ్ళు కాదు. మిల్లు యజమానులు కార్మికులమీద దాడి సాగిస్తే కార్మికులు వెంటనే సమ్మెజేసి తగిన జవాబు చెప్పేవాళ్ళు. లేబర్ ఆఫీసరు దయా దాక్షిణ్యాలకోసం ఎదురుజూస్తూ ఉండవలసిన అగత్యం లేదు.

ఇప్పుడో మిల్లుయజమానులు కార్మికులమీద స్వేచ్ఛగా దాడిజేయవచ్చు. కాని కార్మికులుమాత్రం సమ్మెజేయగూడదు. తొందరపడగూడదు. శాంతం వహించాలి. మానవాతీతులులైన మహాత్ములైపోవాలి. మిల్లు యజమానుల చేతిలో కీలుబొమ్మయైన లేబర్ఆఫీసరు దయాదాక్షిణ్యాలకోసం ఎదురుచూడాలి. యల్. ఫారమ్సు, యమ్. ఫారమ్సు వగైరా కర్మకాండంతా జరుపుతూఉండాలి. పూర్వం మిల్లుయజమానుల అక్రమాల్ని ఎదుర్కోడానికి కార్మికులకు వెంటనే సమ్మెజేసే హక్కుండేది. ఇప్పుడుకూడా కార్మికులకు ఆహక్కు కావాలంటు న్నాను. బి ఐ. డి. యాక్టు వచ్చినతర్వాతనే సాధారణ సమ్మెలుకూడా అక్రమ సమ్మెలుగా మారిపోయాయి. 'అక్రమ' సమ్మెలంటూ కొందరు అదేపనిగా గొంతు చించుకోవడం ఎందుకు? శాసనోల్లంఘనం ఒక పవిత్రమైన కార్యంగా మనదేశంలో భావించబడుతూఉంది. మన జాతీయోద్యమం సాగించిన శాస నోల్లంఘనోద్యమం మనదేశంలో ఒక సత్సాంప్రదాయంగా పరిగణించబడుతూ ఉంది. ఆ సత్సాంప్రదాయాన్నే కార్మికవర్గం నేడు ఇంకాముందుకు తీసుకు పోతూ ఉంది. కాబట్టి సమ్మెలుచేస్తూ ఉన్న కార్మికులకు నిజంగా మనం అభి వందన పరంపర లందజేయాలి.

నందా :—ఆ సమ్మెలన్నీ విఫలం అయిపోయాయి.

డాంగే :—1938 కి పూర్వం సమ్మెలు జయప్రదంకాలేదని మీరు సెలవిచ్చారు. 1938 తర్వాత 'అక్రమ' సమ్మెలు జయప్రదంకాలేదని మళ్ళీ మీరే సెలవిస్తున్నారు. (అయితే వీటికి ఇంకా 'అక్రమ' అనే విశేషణం ఎందుకో) కాబట్టి ఇందువల్ల మనం ఏ నిర్ణయానికీ రాలేము. బొంబాయి లోనే 'అక్రమ' సమ్మె లెక్కువగా జరిగాయని మంత్రిగారంటున్నారు, వారిచ్చిన ఉదాహరణలుకూడా ఎక్కువగా బొంబాయికే సంబంధించి ఉన్నాయి. కాని అసలు వాస్తవంగా జరిగిందేమిటి? సమ్మెలవెల్లువ దేశమంతటా అలుముకుంది. అన్నివైపులా సమ్మెలు జరుగుతున్నాయి. వాటిని మీరు 'సక్రమం' అనుకోండి. లేక 'అక్రమం' అనుకోండి; సమ్మెలకు మూలకారణం ఆర్థిక పరిస్థితులనేవిషయం మంత్రిగారుకూడా

అంగీకరించారు. కాబట్టి సమ్మెలు ఆగిపోవాలంటే ముందు ఆర్థిక పరిస్థితులను చక్కజేయండి, అది ఒక్కటే చక్కని పరిష్కారమార్గం. అంతేకాని లేనిపోని రూల్సుపెట్టి కార్మికుల నోళ్ళకు సీళ్ళువేస్తే సమ్మెలు ఆగవు;

సమ్మెల్ని అణచివేయడం కార్మికోద్యమాభివృద్ధికి తోడ్పడదు, తగాదాల్ని త్వరగా పరిష్కారం చేయడానికికూడా సహాయపడదు. గౌరవనీయులైన మంత్రిగారు నేడు కొత్త శబ్దాల్ని సృష్టిస్తున్నారు. వారు సమ్మెల్ని 'అణచి' వేయరట! 'అదుపు'లో ఉంచడానికి ప్రయత్నిస్తారట! మంత్రిగారు పాతపేరు తీసి కొత్తపేరు పెడుతున్నారు. కార్మిక మంత్రిగారు సమ్మెల్ని 'అదుపు' లో పెడతారు. మరో మంత్రిగారు 'అణచి' వేస్తారు! మంత్రిగారు కార్మికుల హక్కుల్ని రూల్సుతో 'బిగించి' వేయరట! కాని అరికడతారట (కంట్రోలు) ఇందువల్ల శబ్దాలు మారడమేకాని అసలు అర్ధంమాత్రం మారదు. పాత. సారాయినే కొత్తసీసాలో పోయడమవుతుంది.

అంతకు మినహా ఇందువల్ల పరిస్థితుల్లో వచ్చే మార్పేమీలేదు. ఎప్పటిలాగా సమ్మెల్ని అణచివేయడం జరుగుతుంది. కార్మికుల హక్కులు ఈకొత్త రూల్సు అనే సంకెళ్ళతో బంధించివేయబడతాయి. ఈ కొత్తబిల్లులోవున్న 73 వ నిబంధనే ఇందుకు ఉపయోగపడుతుంది. ఈ నిబంధన ప్రకారం మధ్యవర్తి పరిష్కారం జరగాలి ఈ మధ్యవర్తి ఎవరు? పెట్టుబడిదారులక్రింద జీహుకుంలాగా ప్రవర్తించే లేబరు ఆఫీసరు. "లేబరు ఆఫీసరు పంపిన రిపోర్టు మీదగానీ లేక 'తదితర' రిపోర్టులమీదగానీ ఆధారపడి"అని 73వ నిబంధనలో ఉంది. 'తదితర' అంటే ఏమిటి, బహుశా మంత్రిగారి 'రాష్ట్రీయ మజ్దూర్ సంఘం' అయి వుంటుంది; దాన్నిగురించి తర్వాత మాట్లాడతాను. ముందు ఈ 'లేబరు ఆఫీసరంటే ఎవరో చూదాం. మనకు బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన వరప్రసాదమే ఈ లేబరు ఆఫీసరు.

ఈ కొత్త ప్రభుత్వంలోకూడా ఇంకా ఆ పాత లేబర్ ఆఫీసరే ఉన్నాడు. టెక్స్టైల్ పరిశ్రమలో ఈ లేబరు ఆఫీసరుకు 'ఓనమాలు' కూడా రావు. ఇలాంటి లేబర్ ఆఫీసరు పంపిన రిపోర్టుమీద ఆధారపడి తగాదాల్ని పరిష్కరిస్తే ఏమవుతుంది? ఇతను చెప్పే మధ్యవర్తి పరిష్కారానికి కార్మికులు తప్పకుండా బద్ధులైఉండాలట; లేకపోతే అవి అక్రమసమ్మెలట! ఇక 'తదితర'అనే మాటకు వద్దాం. ఈ 'తదితర' అనే మాటకు అర్థం బహుశా సి. ఐ. డి. ల్కు

కూడా కావచ్చు. కొత్తప్రభుత్వంవచ్చింది. కాబట్టి లేబర్ ఆఫీసరుకు, సి. ఐ. డి లకు హృదయపరివర్తనం కలుగుతుందని ప్రభుత్వం ఆశిస్తూవుంది. వాళ్ళ రిపోర్టులమీద ఆధారపడే ప్రభుత్వం తగాదాల పరిష్కారానికి పూనుకుంటుంది. సమ్మెల్ని సాగనివ్వకుండా చేస్తుంది. పూర్వం సమ్మెల్ని నిరంకుశంగా అణచి వేసేవాళ్ళు. ఇప్పుడు 'ప్రజాస్వామికంగా' అణచివేస్తారు. అంతేలేదా! బ్రిటిష్ ప్రభుత్వానికి వారసులుగా ఉన్న ఈ సి. ఐ. డి. లకు ఎప్పటికోగాని హృదయ పరివర్తనం కలగదు. అందాకా వారు పంపే రిపోర్టులమీదనే ప్రభుత్వం ఆధార పడి కార్యాచరణకు పూనుకుంటుంది

ఈ రిపోర్టులు ప్రజాస్వామికంగా ప్రభుత్వాన్ని సంతృప్తిపరచగలుగు తాయా? 73 వ నిబంధనలో ఈ రిపోర్టుల కుపయోగించే విషయా లేమి ఉన్నాయో చూదాం.

"శాంతిభద్రతలకు భంగం కలుగుతుంది అనుకునే పరిస్థితుల్లో"—గత వంద సంవత్సరాల నుంచీ ఈ మాట భారతీయులకు చిరపరిచితమే. బ్రిటిష్ పెట్టుబడిదారులకు సంబంధించిన ఒక కార్ఖానాముందు కాంగ్రెసు మహిళా వాలం టీర్లు (దేశసేవికలు) శాంతియుతంగా పికెటింగ్ చేస్తే అదికూడా శాంతిభద్రత లకు భంగకరమే అని ప్రభుత్వం భావించింది. అవును. ఆనాడు నిరంకుశంగా అణచివేశారు. ఈనాడు మొరార్జీ పోలీసుశాఖామంత్రి కాబట్టి ప్రజాస్వామికంగా అణచివేస్తారు. అమల్నేర్‌లో జరిగిన హింసాకాండను చూచిన తర్వాత ఈ సిద్ధాంతంలో నా కేమాత్రం విశ్వాసం లేదు.

ఇక రెండోవిషయం: "సమాజానికి (కమ్యూనిటీ) ఇబ్బంది కలిగే పరి పరిస్థితుల్లో" ఈ వాక్యాన్ని ఇండియా ప్రభుత్వపు 1929 యాక్టులో నుంచీ తూ-చా తప్పకుండా కాపీజేశారు. ఆసంవత్సరం దేశమంతటా బ్రహ్మాండమైన సమ్మెలు జరిగాయి. ఈ సమ్మెలు జాతీయోద్యమానికి ఎంతో తోడ్పడ్డాయి. ఇందువల్ల 'సమాజానికి ఇబ్బంది' కలిగిందా?

మూడోవిషయం: "పరిశ్రమలు దెబ్బతింటాయి అనుకునే పరిస్థితుల్లో" అనే వాక్యం ఇందులో ఉంది. ఎటువంటి సమ్మెలయినా సరే అందువల్ల పరి శ్రమలు దెబ్బ తినకుండా ఉంటాయి అని యజమాను లంగీకరిస్తారా? మిల్లు యజమానుల ప్రతినిధి ఇక్కడేఉన్నాడు. అతన్నే కనుక్కోండి ఏమంటాడో! మిల్లు యజమానులు ఎప్పుడూ తమలెక్కల్ని మంచి బందోబస్తుగానే ఉంచు తారు. 1938లో కాంగ్రెసుమంత్రివర్గం ఒక కమిటీని (Divatia committee)

నియోగించింది. మిల్లుయజమానులు తమకు 8 లక్షలుమాత్రమే లాభం వచ్చిందని ఆ కమిటీ ముందుజెప్పారు కాని తర్వాత తనిఖీచేస్తే 97 లక్షలు లాభం వచ్చినట్లు తేలింది. మిల్లు యజమానులు టక్కరిలెక్కలు తయారుచేసినట్లు రుజువయింది.

సక్లత్‌వాలా :—(మిల్లుయజమానుల ప్రతినిధి) అవును అప్పుడు లాభంవచ్చిన మాట నిజమే. కాని తర్వాత లాభం పోయి నష్టంవచ్చే పరిస్థితి ఏర్పడింది. అదృష్టమో దురదృష్టమో కాని ఇంతలో యుద్ధం రావడంవల్ల మేము బ్రతికిపోయాము

డాంగే :—యుద్ధంవల్ల దేశంలో కరువు కాటకాలు తాండవించాయి. తిండిలేక ప్రజలు పస్తులు పండుకున్నారు. ఆకలిబాధతో అలమటించి లక్షలకొలది ప్రాణాలు విడిచారు. దీన్ని అవకాశంగా తీసుకొని మిల్లుయజమానులు తమ బొక్కసాల్ని బాగానింపుకున్నందుకు 'సంతోషించాలి'. బహుశా మిల్లుయజమానులు మళ్ళీ మూడో ప్రపంచయుద్ధం రావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారనుకుంటాను.

లేబరు ఆఫీసరు తదితరులు ఈ లాటి తప్పుడు లెక్కల్ని తయారుజేసి ఈ సమ్మెలవల్ల పరిశ్రమలు దెబ్బతింటున్నాయని రిపోర్టులు పంపిస్తారు. ఈ రిపోర్టులమీద ఆధారపడి ప్రభుత్వం నిర్బంధపరిష్కారానికి (కంపల్సరీ ఆర్బిట్రేషన్) పూనుకుంటుంది. అందువల్లనే దీన్ని నేను 'ప్రజాస్వామికంగా' సమ్మెల్ని అణచివేయడం అంటున్నాను.

73 వ నిబంధన ప్రకారం మంత్రి స్వయంగా జోక్యం కలిగించుకొని ఏ సమ్మెనైనా అణచివేయవచ్చు. ఇలా జోక్యం కలిగించుకోడానికి ఇందులో అనేక అవకాశాలున్నాయి. అందులో ఒకటి సమాజభద్రత (పబ్లిక్ ఇంటరెస్టు). మన అనుభవాన్ని బట్టి ఈ మాటకు చాలా విశాలార్థం ఉంది. 'సమాజభద్రత' అనే పేరుతో ఇంతవరకు చేసిన పనులన్నీ సమాజానికి నష్టాన్ని కలిగించేవే. మిల్లు యజమానుల స్వార్థలాభానికి ఇది ఉపయోగించింది. ఇప్పుడు మళ్ళీ నేను గత చరిత్రనంతా ఉదహరించవలసిన అవసరం లేదు. కాని ఈ మాటను వాడడంవల్ల జరిగిపోయిన ఆ పాత చరిత్రే మళ్ళీ జ్ఞాపకం వస్తూఉంది. లచర ఇలో ప్రజాశ్రేయస్సుకు భంగం కలిగించే ఆ నిబంధనను తొలగించవలసిందని కోరుతున్నాను. కార్మికుల న్యాయసమ్మతమైన హక్కుల్లో జోక్యం కలిగించుకోడానికి ప్రభుత్వానికి అంతటి విశాలాధికారాలు ఇవ్వగూడదు. సమ్మెల్ని

అణచివేయగూడదు. దీర్ఘకాలం జరిగే సమ్మెల్లో శాంతిని కాపాడడం సాధ్యమైన విషయం గాదు. దీనికి కారణం మిల్లు యజమానులే. మిల్లు యజమానులు తమ ఇష్టం వచ్చినట్లు దొంగకూలీల్ని (బ్లాక్ లెగ్స్) ఉపయోగించుకోవచ్చు. దొంగకూలీల్ని ఉపయోగించగూడదనే నిషేధం ఈ నిబంధనలో లేదు. దొంగకూలీల్ని ఉపయోగించడం చట్ట సమ్మతంగానే పరిగణించబడుతూ ఉంది. ఇష్టం వచ్చిన పనిముట్టును (లేక యంత్రాన్ని) వాడుకోడానికి మిల్లు యజమానుల కే విధంగా అధికారం వుందో, అలాగే ఇష్టంవచ్చిన కూలిల్ని వాడుకోడానికి కూడా అధికారం ఉంది అని ఈ చట్టం అంగీకరిస్తూ ఉంది. దీని ప్రకారం కూలీలు కూడా పనిముట్లే. ఈలాంటి రూల్సే పూర్వం జారుచక్రవర్తి నిరంకుశ పరిపాలనలో 'కూడా ఉండేవి.

## సమాజం అంటే ?

73 వ నిబంధనప్రకారం ప్రభుత్వానికి సమ్మెల్ని అణచివేసే అధికారం కూడాఉంది. మిల్లుయజమానుల నిరంకుశత్వాన్ని, కార్మికుల బాధ్యతా రాహిత్యాన్ని అరికట్టి పరిశ్రమల్లో శాంతి నెలకొల్పుతాననీ, సమాజ శ్రేయస్సుకు భంగం కలగకుండా చూస్తానని మంత్రిగారు చెప్పతున్నారు. మునిసిపల్ సమ్మెలు వగైరా సమాజశ్రేయస్సుకు భంగం కలిగిస్తాయనికూడా చెప్పారు, అలాటి సమ్మెలమీద నిర్బంధవిధానం అమలుపరుస్తారు. ఇది ప్రభుత్వం పంథా, కాని అసలు సమ్మెలు ఎందుకు వస్తున్నాయి ? ముందు కార్మికులకు కావాలిసిన ఆర్థిక సౌకర్యాలు కలిగించండి. వారికి కూడా మానవ జీవితానికి అవసరమైన అవకాశాలు చూపెట్టండి. అప్పుడు సమాజం యెడల వారికున్న బాధ్యతను బోధించండి. అదొక్కటే సరియైన పంథా. ముందు వారికి కావాలిసిన జీవితావసరాలను సమకూర్చకుండానే మీరు ధర్మబోధజేస్తే లాభంలేదు. కమ్యూనిస్టులే కార్మికుల్ని తప్పుదారిన నడిపించి సమ్మెలు జేయిస్తున్నారని మంత్రి సత్తములు సెలవిచ్చారు. పాతప్రభుత్వం పలికిన పలుకుల్నే మంత్రిగారు వల్లిస్తున్నారు. సమాజ శ్రేయస్సును అందరూ అభిలషించ వలసిందే. అందులో ఏమీ సందేహంలేదు. కట్టుకోడానికి బట్టా, తింటానికి తిండీ లేకబాధ పడే కార్మికవర్గానికి సమాజ శ్రేయస్సును గురించి ధర్మసూత్రాలు జెప్పితే లాభమేమిటి ? అసలు సమాజం అంటేఏమిటి ? రైతు కార్మికవర్గమే సమాజం. రైతుల్ని, కార్మికుల్ని కష్టజీవుల్ని మినహాయిస్తే ఇక మిగిలేది జమీందార్లు, పెట్టుబడిదారులు. ప్రభుత్వం. మొత్తం నలభైలక్షల జనాభాగల కలకత్తాలో 40

లక్షలమంది సమ్మెచేస్తే ఇంకావేరే సమాజం ఎక్కడ ఉంది ? కలకత్తా జనాభా అంతా సమ్మెపల్ల కలిగే ఇబ్బందుల్ని అనుభవించడానికి సిద్ధమయింది. సమాజ శ్రేయస్సుకోసమేనా ఈ సమ్మెను అణచివేసింది ? పోస్టల్ కార్మికులకు సాను భూతిని తెలియపరుస్తూ బొంబాయి కార్మికులు సమ్మెజేశారు. బొంబాయిజనాభా అంతా పోస్టల్‌సమ్మెను బలపరచింది. లేబర్ ఆఫీసరుగానీ 'తదితరులు'గానీ సమాజ శ్రేయస్సుకు భంగం గలుగుతుందని రిపోర్టులు పంపిస్తే అప్పుడు మంత్రిగారు జోక్యం కలిగించుకుంటారు. సమ్మెను అణచివేస్తారు. 'సమాజం' (కమ్యూనిటీ)అంటే మంత్రిగారి దృష్టిలో ఒక'అవ్యక్త పరబ్రహ్మ'లాగా అనిర్వ చనీయంగా ఉంది. 'సమాజ శ్రేయస్సు' అనే సాకుతో ఈ విధంగా ఏసమ్మె నైనా అణచివేయవచ్చు. కార్మికులకు 'సమాజ శ్రేయస్సును' గురించి బోధించే ముందు కార్మికుల ఇబ్బందుల్ని తొలగించి వారిఆర్థికపరిస్థితుల్ని చక్కచేయండి. 73 వ నిబంధనలో లేబర్ ఆఫీసరు తదితరుల (సి. ఐ. డి. వగైరా) విషయం పేర్కొన్నారే కాని కార్మికసంఘంపేరు తలపెట్టలేదు. ట్రేడ్‌యూనియనిస్టు అయిన లేబర్‌మంత్రి నందాగారు కార్మికవర్గానికి చేసినసహాయం ఇలాఉంది ! ప్రభుత్వయంత్రంలో కార్మికవర్గాన్నికూడా ఒక ప్రధాన భాగంగా పాటించాలి.

'సమాజం' అనే సాకుతో ఈ క్లాజు కార్మికోద్యమాన్ని అణచివేస్తుంది. కాబట్టి దీన్ని పూర్తిగా తొలగించివేయాలని కోరుతున్నాను.

ఈ చట్టం వచ్చినప్పటినుంచి వస్త్ర పరిశ్రమలు సమాజానికి 'శ్రేయస్కరం'గా ఎలా పనిచేశాయోచూదాం. సమ్మెలు జేయడంవల్ల సమాజానికి ఇబ్బంది కలిగిందని కార్మికులమీద నేరం ఆరోపిస్తున్నారు. దేశంలో బట్టల కరువు ఏర్పడిందని చెప్పుతున్నారు. గనుల్లో పనిజేసే స్త్రీ కార్మికులు కట్టుకోవడానికి బట్ట లేకపోవడంవల్ల పనుల్లోకి వెళ్ళడంమానేసి ఆత్మహత్యలు జేసుకున్నారు. బట్టల కరువువల్ల ఒక్క దొంగవర్తకులుతప్ప ప్రజలందరూ బాధపడేమాట వాస్తవమే. కాబట్టి వస్త్రపరిశ్రమల్లో జరిగే ప్రతిసమ్మెను సమాజ శ్రేయస్సుకు భంగం కలిగిస్తుందనిచెప్పి అణచివేయవచ్చు. ఈ బట్టలకరువుకు అసలు కారకులెవరో ప్రభుత్వం కొంచెం తాపీగా నిష్పక్షపాతంగా ఆలోచించాలి. బట్టల కరువుకు ప్రధానకారకులైన మిల్లుయజమానులమీద మంత్రివర్యులింతవరకు ఏమైనా చర్య తీసుకున్నారా ? దొంగవర్తకులు సాగించే దొంగవ్యాపారాన్ని అణచివేశారా ? లేదు. మన మంత్రివర్యులు అలాంటిదేమీ చేయలేదు. ఈచట్టంలో

వున్న నిరర్ధక విషయాల్నిగురించికూడా నేను స్పష్టంచేయకపోతే 'సమాజం' అనే పేరుతో మంత్రివర్యులు నన్నుకూడా అణచివేస్తారు.

బట్టలకరువుకుగల కారణాల్ని తెలియపరుస్తూ జాతీయపత్రికల్లో పెద్దపెద్ద ప్రకటనలు కనిపిస్తూఉన్నాయి. జాతీయపత్రికలుకూడా అలాంటిప్రకటనలు తీసుకోవడంలో అర్ధమేమిటో నాకు బోధపడడం లేదు. కార్మికుల సమ్మెల ఫలితంగానే బట్టలకరువు ఏర్పడిందని ఆ పత్రికల్లో ప్రకటించబడుతూఉంది. బట్టలకరువు కారణం కార్మికుల సమ్మెలు కాదని అనేకమంది బాధ్యతగల వ్యక్తులే ప్రకటించారు. తగినంత బొగ్గులేకపోవడంవల్లనే బట్టలకరువు ఏర్పడిందని టెక్స్టైల్ కంట్రోల్‌బోర్డు సభ్యులు లాలాసర్ శ్రీరామ్‌గారు 1946 జులైలో జరిగిన టెక్స్టైల్ మీటింగులో ప్రకటించారు. వీరు కమ్యూనిస్టుపార్టీ సభ్యులుగాదు. రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడినతర్వాత నాలుగుమాసాలకు ఈ ప్రకటనజరిగింది. బొగ్గుసధికంగా ఉత్పత్తిజేసే బీహారు రాష్ట్రంలోకూడా అప్పటికి నాలుగు మాసాలకుపూర్వమే కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడింది దొంగవర్తకులముఠాలో పేరెన్నికగన్న 'పరమపవిత్రులైన' అహమదాబాద్‌మిల్లుయజమానులు శ్రీరామ్‌గారి ప్రకటనను ఖండిస్తూ ఆందోళనజేశారు. తగినంతమంది కార్మికులు దొరక్కపోవడమే బట్టలకరువుకు కారణమని ప్రకటించారు. చివరకు రేట్సు దగ్గర వాళ్లు తమలోతాము కలహాలు పెంచుకొని యదార్ధవిషయాన్ని బైటబెట్టారు, పిల్లి కండ్లుమూసుకొని పాలుతాగుతూ తనను ఎవరూ చూడడంలేదు అనుకుంటుందట! తమమీటింగుల్లో జరిగేచర్చలు బైటిప్రపంచానికి తెలియడం లేదని మిల్లుయజమానులు అనుకున్నారు పాపం! తగినంతమంది కార్మికులు దొరకడంలేదు అనే మిల్లుయజమానుల వాదన విని టెక్స్టైల్ బోర్డులోవున్న మరోసభ్యుడు ఆశ్చర్యపోయాడు.

"వస్త్రపరిశ్రమల్లో పనిజేస్తూఉన్న కార్మికులు మొత్తం 6 లక్షలకంటె ఎక్కువలేరు. యుద్ధానంతరం ఒక్కమిలటరీనుంచే 8 లక్షలమంది సైనికులు తొలగించబడితే పరిశ్రమల్లో పనిచేయడానికి తగినంతమంది కార్మికులు దొరక్కపోవడమేమిటి? అని ఆసభ్యుడు ప్రశ్నించాడు. అతను కమ్యూనిస్టుపార్టీకి సంబంధించిన వ్యక్తిగాదు. అతనిపేరు గోవర్ధనదాస్ మొరార్జీ.

ఉత్పత్తి నిజంగా తగ్గిపోయిందని కొందరు భ్రమపడుతున్నారు. దీన్ని గురించికూడా రెండు ముక్కలు చెప్పుతాను. గత మూడు సంవత్సరాల యుద్ధ కాలంలో ఉత్పత్తి చాలా అధికంగా జరిగింది. సంవత్సరానికి 36000 లక్షల

గజాల గుడ్డనుంచి 48000 లక్షల గజాల గుడ్డవరకు పెరిగింది. చేనేత పరిశ్రమకూడా విరివిగా సాగింది. యుద్ధావసరాలకు సరిపోను గుడ్డను మినహాయించినా బట్టల కరువు ఏర్పడడానికి ఎటువంటి అవకాశం లేదు. అయితే బట్టల కరువు ఎందుకు వచ్చింది? 1943 లో తేలిన లెక్కల్నిబట్టి చూస్తే 9 మాసాల ఉత్పత్తికి సరిపోయిన గుడ్డ దొంగమార్కెట్‌లో నిలవ ఉండిపోయింది. బట్టల కరువుకు అసలు కారణం ఇదే. దేశంలో బట్టలకరువు వచ్చిందని దొంగవర్తకులు ఒకవైపు బాకాలూదుతున్నారు. మరోవైపు విదేశాలకు బట్ట నెగుమతి చేయడానికి పర్మిట్లు ఇప్పించవలసిందని ఆందోళన జేస్తున్నారు. భారతదేశంయొక్క పేరుప్రతిష్ఠల్ని నిలబెట్టడానికి ఇతర దేశాలకు మంచి మంచి రకాల గుడ్డలు ఎగుమతి చేస్తారట! పనికిరాని చెత్తారానిరకం అంతా మన భారతీయుల ముఖాన వేస్తారట!

నందా :— కమ్యూనిస్టుపార్టీ తరఫున టెక్స్‌టైల్ బోర్డులో మీరు కూడా ఒక సభ్యులుగా ఉన్నారు గదా?

డాంగే :— మిమ్మల్ని కూడా ఒక సభ్యులుగా ఉండవలసిందని ఆహ్వానిస్తే మీరు నిరాకరించారు.

ఖేర్ :— (ప్రధాన మంత్రి) గౌరవనీయ సభ్యులైన డాంగేగారు చెప్పుతూ ఉన్న విషయాలన్నీ చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి. కాని ఈ బిల్లుకూ వాటికీ సంబంధ మేమిటి?

డాంగే :— మీ సహచరులైన కార్మికశాఖ మంత్రిగారిచ్చిన ఉపన్యాసానికి (స్పీచ్) సమాధానాలు ఇస్తున్నాను.

ఖేర్ .— నా సహచరులు (కార్మిక మంత్రి) బహుశా కొన్ని అప్రస్తుత విషయాలు మాట్లాడి ఉంటారు!

డాంగే :— మంత్రివర్గం తరఫున మీ సహచరులు మాట్లాడిన అప్రస్తుత విషయాల్ని మీరు సహించారు. సభ్యుల తరఫున నేను మాట్లాడే అప్రస్తుత విషయాల్ని కూడా సహించండి.

కార్మికుల్లో పని నైపుణ్యం తగ్గిపోయింది. కాబట్టి బట్టల కరువు ఏర్పడడానికి ఇది కూడా ఒక కారణం అని మంత్రివర్యులు సెలవిచ్చారు.

సక్లత్‌వాలా :— బొంబాయి మిల్లులో కార్మికుల నాగాలు నూటికి 11 నుంచి 21 వరకు పెరిగిపోయాయి.

డాంగే :— మిల్లు యజమానుల నాగాల్ని గురించి మీ రేమీ చెప్పరేం? యజమానుల కెప్పుడూ రెండు నాలుకలుంటాయి. మా స్టోర్సులో తగినన్ని సరుకులు లేవు. కాబట్టి దిగుమతులకు పర్మిట్లు ఇప్పించవలసిందని అటు ప్రభుత్వం మీద ఆందోళనజేస్తూ ఉంటారు. కార్మికులకు ఎక్కువ జీతాలు లభిస్తున్నాయి కాబట్టి నాగా లెక్కువై పోయాయనీ, పనిలో నైపుణ్యం తగ్గిపోయిందనీ ఇటు ప్రజలతో చెప్పుతూ ఉంటారు.

కార్మికులశక్తి సామర్థ్యాలు, క్రియానైపుణ్యం ఎప్పటిలాగే ఉన్నాయి. కాని మిల్లుయజమానులే వాటిని దెబ్బగొడుతూ ఉన్నారు.

స్పీకరు :—గౌరవనీయ సభ్యులైన డాంగేగారు ఇంకా ఎంతసేపు ఉపన్యాసాన్ని కొనసాగిస్తారు? వారినే నిర్ణయించుకోవలిసిందని ఈభారం వారిమీదనే వేస్తున్నాను.

డాంగే :—73 వ క్లాజులోఉన్న 'సమాజం' అనేదాన్నిగురించి, రెండుమూడు షెడ్యూల్సునుగురించి, కొంతవరకే మాట్లాడాను.

## "నై పు ణ్యా త"

'నైపుణ్యం' అనేదానికి ఉదాహరణగా ఒకమిల్లును తీసుకుంటాను. ఈమిల్లులో వెయ్యిమంది కార్మికస్త్రీలు సమ్మెజేసి పోలీసుశాఖా మంత్రిని (క్రిందటి కాంగ్రెస్ మంత్రివర్గంలో) ఓడించారు. ఈలాటి ఆదర్శప్రాయమైన సమ్మెజేసిన కార్మికుల్లో నైపుణ్యం తగ్గిందా? వారి నైపుణ్యతను సూచించే వివరాలు యిస్తాను.

| | |
|---|---|
| 1938 లో | 78 . 16 |
| 1940 ,, | 81 . 46 |
| 1942 ,, | 77 . 8 |
| 1943 ,, | 81 |

1943 లో 81 ఉన్న మాట వాస్తవమే అని మిల్లుయజమానే స్వయంగా అంగీకరించాడు. ఇక తగ్గింది ఎక్కడ?

పోతే ఇక నాగాలెక్కువ అవుతున్నాయంటారా? ఉంటానికి కార్మికులకు సరియైనఇండ్లు లేకపోవడం, అంటువ్యాధులు, జబ్బులు, చాలీచాలనిరేషన్లు ఇవ్వడమే ఇందుకుకారణం.

కొన్ని ప్రదేశాల్లో బొగ్గుకొరత ఏర్పడింది. ఈ కొరతను మిల్లుయాజమానులు తమ స్వార్థంకోసం బాగా ఉపయోగించుకున్నారు. ఈ సాకుతో బట్టల ధరలు పెంచారు. ఇందులో దేశభక్తులని చెప్పబడే అహమదాబాద్ మిల్లుయజమానులు కూడా భాగస్వాములే. మంత్రిగారి స్వంతసంఘమైన మజదూర్ మహాజన్‌తో ఈ మిల్లు యజమానులు లాలూచీ అయ్యారు. కోల్(బొగ్గు) ఫైరింగ్ బాయిలర్‌ను ఆయిల్ ఫైరింగ్ బాయిలరుగా మార్చవలిసిందని ఈ యజమానులకు ఒక సూచన ఇవ్వబడింది. అలా చేయడానికి కొందరు అంగీకరించారు కూడా. కాని అహమదాబాద్ మిల్లు యజమానులసంఘం మాత్రం అందుకు అంగీకరించలేదు. ఇందువల్ల సమాజ శ్రేయస్సుకు భంగం కలిగించిందెవరు? యజమానులా? కార్మికులా? దొంగవర్తకుల్ని ఉరితీయడమంటే ఇదేనా? మంత్రివర్యులు వాళ్ళను ఉరితీస్తే సమాజశ్రేయస్సుకోసం మేము కూడా ఉరి దీయబడడానికి సిద్ధంగానే ఉన్నాం.

నందా:— ఇది సోవియట్ రష్యాకాదు. మ రే ం పర్వాలేదు. మిమ్మలను ఉరితీయం.

డాంగే:— ఓహో, అయితే మీరు ఉరిశిక్షనే రద్దుచేశారన్నమాట!

1945 లో ఒక్క అహమదాబాద్‌లోనే 654000 టన్నుల బొగ్గుకొరత ఏర్పడింది. అంటే వస్త్రోత్పత్తిలో 770 లక్షల గజాల గుడ్డ తక్కువ అయిందన్నమాట. దీనికి బాధ్యులెవరు? ఇందువల్ల సమాజానికి ఎంత నష్టం కలిగింది? ఇందువల్ల కార్మికుల వేతనాల్లో ఎంత లోటు వచ్చింది? ఇక కార్మికుల్ని కాపాడింది ఎక్కడ?

నందా:— మూడవ షెడ్యూలు ప్రకారం యిటువంటి కేసుల్లో కార్మికులకు తగిన ప్రతిఫలం ఇవ్వబడుతుంది.

డాంగే:—మిల్లు యజమానులు కలిగించే ఇటువంటి ప్రతిబంధకాలవల్ల సమాజ శ్రేయస్సుకు భంగం కలుగకుండా చూడడం అంటూ జరగడంలేదు. ఈ చట్టంలోని 16 వ నిబంధన ప్రకారం కార్మికులకు ఇలాంటి కేసుల్లో తగిన ప్రతిఫలం ఇవ్వాలి అని ఎక్కడాలేదు. అందువల్లనే నేను దీన్ని జారు చక్రవర్తినాటి నిరంకుశ చట్టం అని పేర్కొన్నాను. చట్టంలో ఉన్న నిబంధనలు మంచి పకడ్‌బందీగా లేకపోతే మిల్లు యజమానులు ఎన్ని మోసాలైనా చేయగల్గుదురు. కుట్రలు బన్నడానికి యిందులో అనేక అవకాశాలున్నాయి. కార్మికమంత్రినే మోసంజేసిన మిల్లు యజ

మానులకు ఇవి ఒక లెక్కా? వాళ్ళుచేసే మోసాలన్నీ మనం ఈనాడు ఊహించలేము. కాని వాళ్ళతో నాకు ఎప్పుడూ పనివుంటుంది కాబట్టి నేను కొన్ని చెప్పగల్గుదును. అయినా ఈ పేచీలు, తికమకలులేకుండా కార్మికులకు సమ్మెజేసే హక్కుంది అని ఒక్కమాట అంగీకరిస్తే సరి పోతుందిగదా. అలాంటి హక్కును కార్మికులకివ్వకుండా ఈ చట్టం అవరోధాలు కలిగిస్తూవుంది.

నందా.—డాంగేగారు సమ్మెలవిషయంలో సభ్యుల్ని తప్పుదారి బట్టిస్తూన్నారు.

డాంగే.—సరే. అయితే ఒక్కమాట! ఇప్పుడు నేను సమ్మె జేయవచ్చునా?

నందా.—లేదు. మధ్యవర్తిద్వారా పరిష్కారం జరుగుతుంది.

డాంగే!—అలా జెప్పండి. మొత్తంమీద సమ్మెజేసే అధికారం మాత్రం లేదన్నమాట! అందుకోసమే నేనింత గట్టిగా చెప్పవలసి వచ్చింది. బొగ్గుకొరతవల్ల పరిశ్రమలు ఆగిపోయినప్పుడు కార్మికులకు ప్రతిఫలం ఇవ్వబడుతుందంటే దానికి కారణం కార్మికుల పోరాటమే కాని, ఈ చట్టంలో ఉన్న 73 వ నిబంధన కాదు. ఢిల్లీలో జరిగిన మూడుపార్టీల సమావేశంలో మేమే దీన్ని గురించి ప్రశ్నించాం. "కార్మికులను నిర్బంధంగా నిరుద్యోగ సమస్యకు గురిజేసే పక్షంలో కార్మికు లేం జెయ్యాలి? అనే విషయం ఈ చట్టంలో లేనేలేదు. తరువాత ఎప్పుడో ప్రతిఫలం వస్తుందేమో! కాని అందాక కార్మికులు పస్తులు పండుకోవా లిసిందేనా? కాబట్టే నిరుద్యోగ కాలంలో కార్మికులకు జీవనోపాధి కలిగించే ఒక చట్టాన్ని వెంటనే ప్రవేశపెట్టడం అవసరం.

వస్త్రోత్పత్తిలో 'సమాజ శ్రేయస్సుకు భంగం' అనేమాట సమ్మెల్ని అణచివేయడానికి ఒక సాకుగా ఉపయోగిస్తుంది. మంత్రిగారు ఇలాంటిశబ్దాల్లో తికమకలు పడి కార్మికుల హక్కుల్ని అరికట్టగూడదు. కార్మికుల కష్టాన్ని దోచుకుతినే ఈ మిల్లు యజమానుల్ని అణచివేయాలి గాని, కార్మికుల్ని అణచి వేయగూడదు.

ప్రజాస్వామికం అనే పేరుతో ఈ చట్టాన్ని అంగీకరించవలసిందని మీరు నన్ను కోరారు. ముందుగా పీడిత ప్రజల అభిప్రాయాన్ని తీసుకొని తయారుజేసిన చట్టం ఇంతవరకు ఈ దేశంలో ఒక్కటికూడా లేదు. ఒకపార్టీ మంత్రివర్గాన్ని ఏర్పరచవచ్చు. అంత మాత్రాన ఆ పార్టీ సిద్ధాంతాలే పరిపాలన యంత్రం అంతటికి ఆధారభూతం కాకపోవచ్చు. ఎన్నికల్లో ఈనాడు అధిక

సంఖ్యాకంగా ఒకపార్టీ గెల్చినంత మాత్రాన ఆపార్టీ ప్యాసుచేసే ప్రతిబిల్లు ప్రజాస్వామికం అనిపించుకోదు. ఎన్నికలు ఎలా జరిగాయి? ప్రజలందరికి వయోజన వోటింగు అధికారం ఉందా? ఉత్పత్తి సాధనాలను పెట్టుబడిదారుల చేతుల్లోనుంచి లాక్కొని ప్రభుత్వపరం చేసినప్పుడే ఒక వర్గాన్ని మరోవర్గం దోచుకోడం ఆగిపోతుంది. అప్పుడే నిజమైన ప్రజాస్వామికయుగం ఆరంభం అవుతుంది. ఈనాడు అధిక సంఖ్యాకులయిన ప్రజలకు వోటింగు అధికారమే లేదు. కాబట్టి ఇప్పుడు ఈ ప్రభుత్వం చేసే ప్రతిచట్టం ప్రజాస్వామికం అని చెప్పుకోడానికి ఎవరికి అధికారంలేదు. పరిశ్రమలకు సంబంధించిన ప్రజాస్వామిక చట్టాల్ని ప్రవేశపెడుతున్నానని మంత్రిగారు చేసిన ప్రకటనను నేను ఖండిస్తున్నాను.

ప్రజల్ని పీడించుకుతినే పెట్టుబడిదారుల దోపిడిని అరికట్టలేదు. ఉండటానికి ఇల్లులేక, తింటానికి తిండిలేక కార్మికులు సమ్మెచేస్తే అది ఒక మహాపాపమా? జీవితావసర వస్తువుల ధరలు 400% రెట్లు పెరిగినా కార్మికుల వేతనాలు 90% కూడా పెరగలేదు. నేను జెప్పిన ఈ విషయాన్ని మంత్రిగారు కాదనగల్గురా?

నందా:— కాదని ప్రభుత్వం ఎప్పుడూ అనలేదే!

డాంగే:— అయితే ధరల పెరుగుదలతోపాటు కార్మికుల వేతనాలుకూడా పెంచాలి అనే ఆందోళనను అరికట్టనని మంత్రిగారు హామీ ఇస్తారా?

నందా:— అలా హామీ ఇవ్వను.

డాంగే:—అలాచెప్పండి.

మంత్రిగారు ఈ కొత్తబిల్లును ప్రవేశపెడుతూ ఈలాటి ఉత్తమచట్టం మరేదేశంలో లేదని సెలవిచ్చారు. ఈచట్టం ప్రస్తుతం ఇతరదేశాల్లోఉన్న చట్టం లాంటిదేఅనికూడా సెలవిచ్చారు. ఈరెండు వాక్యాలు పరస్పర విరుద్ధమైనవి. సరే. బి. ఐ డి. యాక్టు ఉపోద్ఘాతంలో ఇతరదేశాల చర్చకూడా కొంతఉంది. కాని ఈచట్టంలో అలాంటిదేదీలేదు. మంత్రిగారు నిజంగా ఇతరదేశాల ననుసరించదలచుకున్నారా? అయితే ఇతరదేశాల ఉదాహరణలేచూడండి! కార్మిక సంఘంలో సభ్యులుగా చేరని నలుగురు పనివారలకు ఉద్యోగాలిచ్చినందుకు బ్రిటిష్ కార్మికులు వెంటనే సమ్మెజేశారు. ఈవిధానాన్ని మన కార్మికులుకూడా అనుసరించవచ్చునా? క్రిష్టమస్ పండుగరోజుల్లో సెలవులివ్వలేదనే కారణంతో బ్రిటిష్ రైల్వేకార్మికులు ముందునోటీసు ఇవ్వకుండానే హఠాత్తుగా నీటిసరఫరా

ఆపివేశారు. ఇతర దేశాలననుసరించి మీరీచట్టం తయారుజేశామని చెప్పు తున్నారు. అయితే మనదేశ కార్మికులుకూడా ఇతరదేశ కార్మికులవలంబిస్తూ వున్న ఈపద్ధతిని అనుసరించవచ్చునా ? అమెరికాలో ముందు నోటీసు ఇవ్వ కుండానే బ్రహ్మాండమైన సమ్మెలు సాగుతున్నాయి. కాబట్టి ఇతరదేశాల ప్రసక్తి ఎత్తుకోవడం మంత్రిగారికేమీ ఉపకరించదు.

ఇతరదేశాల్లో ఎక్కడా ఈలాంటి చట్టంలేనిమాట వాస్తవమే. 'సమాజ శ్రేయస్సు' అనే పేరుతో ఈవిధంగా కార్మికోద్యమాన్ని అణచివేసే చట్టం మరెక్కడాలేదు.

నిర్బంధంగా మధ్యవర్తి పరిష్కారాని ఒప్పుకోవాలి అనే నిబంధన వెనకటి బి. ఐ. డి. చట్టంలోలేదు. మొదట యిలాంటినిబంధనే ఆచట్టంలోకూడా ఉంది. కాని మా ఆందోళన ఫలితంగా తర్వాతదాన్ని ఉపసంహరించుకున్నారు.

ఖేర్ .— (ప్రధాన మంత్రి) ఆ బిల్లు బాధ్యత నాదే. అలాంటి నిబంధన ఆ చట్టంలో అసలు లేనే లేదు.

డాంగే :— ఆ చట్టంలో అలాంటి నిబంధన ఉందనే నా అభిప్రాయం. అప్పుడు నేను ఈ శాసనసభలో సభ్యుడుగా మాత్రం లేను.

ఖేర్ :— సరే. దాన్ని గురించి తర్వాత ఆలోచిద్దాం.

డాంగే .— అలాగే. మా ఆందోళన తర్వాత మీరు ఆ నిబంధనను ఉపసంహ రించుకున్నారు.

అసలు మధ్యవర్తి పరిష్కారమే ఉండగూడదని నేను చెప్పడల్లేదు. పరిష్కారానికి ముందు కార్మికుల ఆర్థిక పరిస్థితులను బాగుజేస్తూ ఒక చట్టం ప్రవేశపెట్టవలసిందని కోరుతున్నాను.

వెనకటి చట్టంలో కార్మికులకు సమ్మెజేసే అధికారం నామమాత్రంగా నైనా ఉంది. కాని ఈ కొత్తచట్టంలో ఆ నామమాత్రాధికారం కూడా పూర్తిగా రద్దుచేయబడింది.

సమ్మె జేసే అధికారం కార్మికులకు ఎందువల్ల ఉండాలంటున్నామో కొంచెం తెలియజేస్తాను. సమ్మెల్ని రెచ్చగొట్టడం మా పాలసీ కాదు. కార్మికు లకు సమ్మెజేసే అధికారం ఉండాలి అన్నంత మాత్రాన సమ్మెలు జేయిస్తూ ఉండటమే మా పని గాదు. సమ్మెలు చేసినా, చేయకపోయినా, సమ్మెజేసే అధికారం మాత్రం ఉండాలి. మేము ఏదైనా ఒక సమ్మెను బలపరచడల్లే దంటే దాని అర్థం సమ్మె హక్కునే వదులుకున్నామని కాదు. తమ న్యాయ

మైన హక్కులు సంపాదించుకోవాలంటే కార్మికుల చేతుల్లో ఉన్న ఆయుధం సమ్మె ఒక్కటే. కార్మికుల్ని లొంగదీయడానికి మిల్లు యజమానుల చేతుల్లో అనేక ఆర్థిక రాజకీయ ఆయుధాలున్నాయి. ఏ మిల్లుల్లో పనిచేసి కార్మికులు బ్రతుకుచున్నారో ఆ మిల్లుల మీద సర్వాధికారాలు యజమానులకే ఉన్నాయి. కార్మికులు తమ సర్వశక్తులు మిల్లులకే ధారవోస్తున్నారు. ఆ మిల్లులవల్ల వచ్చే లాభాలన్నీ యజమానుల జేబుల్లోకి, ఇనుపపెట్టెల్లోకి పోతున్నాయి. 'సమాజ శ్రేయస్సు'కోసం కార్మికులు పనిచేయాలన్నారు. బాగుంది! కాని ఈ సూత్రమే మిల్లులకు కూడా ఎందుకు వర్తించదు? యజమానులు మిల్లుల్ని 'సమాజ శ్రేయస్సు'కోసం నడుపుతున్నారా? లేక తమ పొట్టలు నింపుకోడానికా? కార్మికులు తమ శ్రమశక్తిని మిల్లు యజమానులకు అర్పిస్తున్నారు. దాన్ని మిల్లు యజమానులు తమ స్వార్థం కోసమే ఉపయోగించుకుంటున్నారు. మిల్లు యజమాల స్వార్థంకోసం కార్మికులు తప్పకుండా తమ శ్రమశక్తిని అర్పించ వలసిందే అనడం ఏమి సబబు?

1850 సంవత్సర ప్రాంతంలో మన దేశంలో పరిశ్రమలు ప్రారంభ మయ్యాయి. 1854 లో మొట్టమొదటి టెక్స్టైల్ మిల్లు బొంబాయిలో నిర్మించబడింది. ఇదేసమయంలో మొదటిసారిగా జూట్ మిల్లు, రైల్వేనిర్మాణం కూడా ప్రారంభమయింది.

సర్లత్‌వాలా :— పోస్టుబిళ్ళలుకూడా ఆ సంవత్సరమే వచ్చాయి.

## కార్మికులు తమ హక్కుల్ని ఎలా సాధించారు?

డాంగే :— మొదట యూరోపియన్ పెట్టుబడిదారులు, ఇండియన్ పెట్టుదార్లు మన దేశంలో పరిశ్రమల్ని స్థాపించారు. సంసారాలు చితికిపోయి దివాలాతీసిన రైతులు జీవనోపాధికోసం ఈ మిల్లుల్లో కార్మికులుగా ఉండి పనిచేయసాగారు. ఆ రోజుల్లో కార్మికుల పరిస్థితులు మరీ అధ్వాన్నంగా ఉండేవి. ఇన్నిగంటలు పనిచేయాలనే నియమంలేదు. మిల్లుల్లో పనిచేస్తూ అపాయాలకు గురియై ప్రాణాలు కోల్పోయిన కార్మికుల కుటుంబాలకు ప్రతిఫలం ఏమాత్రం ఇచ్చేవాళ్ళుగాదు. స్త్రీ కార్మికులకు ప్రసూతి సౌకర్యాలు ఉండేవికావు. పిల్లలచేత పనిచేయించగూడదనే నిషేధంలేదు. ఆనాటి రిపోర్టుల్లో యీ విషయాలన్నీ స్పష్టంగా ఉదహరించబడే వున్నాయి. 1850 నుంచి 1914 లేక 1918 వరకు సమ్మెల

తీవ్రత అంతగాలేదు. అక్కడక్కడ నిర్మాణరహితమైన కొన్ని తిరుగుబాట్లుమాత్రం జరుగుతూవుండేవి. తమ న్యాయసమ్మతమైన హక్కుల్ని సాధించుకోడానికి కార్మికులకు ఆనాడు నిర్మాణయుతమైన సంఘబలంలేదు. కార్మికుల శ్రమశక్తిని యజమానులు తమ యిష్టం వచ్చినట్లు దోచుకుంటూవుండేవారు. అలాంటి విషాదకరపరిస్థితుల్లోకూడా మిల్లుయజమాన్లు బుద్ధిపూర్వకంగా కార్మికులకు సౌకర్యాలు కలుగజేస్తారా? ఆందోళనలేకుండా మిల్లుయజమాన్లే బుద్ధిపూర్వకంగా ఆ 'అభాగ్య' కార్మికుల హక్కుల్ని అంగీకరిస్తారనుకోవడం శుద్ధ పొరపాటు. 1890 వరకు స్త్రీకార్మికులు రాత్రిపూట పనిచేయగూడదనే నిషేధంకూడాలేదు. 1911 వరకుగంటల నియామకం ఏర్పడలేదు. తర్వాత చట్టాలేర్పడినప్పటికి మిల్లు యజమానులు వాటిని పాటించలేదు. సంఘటిత కార్మికోద్యమ సహాయంతో కార్మికులు సమ్మె హక్కు నుపయోగించినప్పుడే ఈ చట్టాలు అమల్లోకి వచ్చాయి. ఈ విషయాన్ని డి. ఆర్. గాడ్గిల్ వగైరా ఆర్థిక శాస్త్రవేత్తలే అంగీకరించారు. రాత్రిపూట చీకటిగా ఉండడంచేత గత్యంతరంలేక మిల్లుయజమానులు రాత్రిళ్ళు అయినా కార్మికులకు సెలవు ఇవ్వవలసి వచ్చేది. ఏంజేస్తారుపాపం! ఇది విధికృతం. కాని కొన్నాళ్ళకు ఈ విధికృత నియమాన్నికూడా యజమానులు ఉల్లంఘించారు. ఎలక్ట్రిక్ దీపాల నేర్పరచి కార్మికులతో రాత్రిళ్లు కూడాపనిచేయించారు. రోజుకు 13గంటలు మాత్రమే పనిచేయించాలిఅని కార్మికులు యజమానులతో ఎంత దీర్ఘకాలం పోరాటం సాగించారో "డెబ్బదిసంవత్సరాల మిల్లుయజమానుల సంఘచరిత్ర" అనే పుస్తకంలో ఉల్లేఖించబడింది. పుస్తకాన్ని రచించింది మరెవ్వరోకాదు మిల్లు యజమానుల ప్రతినిధిగా ఇప్పుడీ సభలో హాజరైవున్న సర్లత్‌వాలా గారే. 1918 నుంచి సమ్మెల వెల్లువ సాగింది. 1920 లో సమ్మెల తీవ్రత భీషణ రూపం ధరించింది. తత్ ఫలితంగా కార్మికులచేత రోజుకు 10 గంటలు మాత్రమే పనిచేయించాలి అనేనియమం వచ్చింది. తమ సమ్మెహక్కు అనే ఆయుధాన్ని ఉపయోగించకపోతే కార్మికులకి సౌకర్యం కలిగేదా? బోనస్‌కోసం 1923లో సర్వవ్యాప్తసమ్మె జరిగింది. ఆ సంవత్సరమే నేను కార్మికోద్యమంలో ప్రవేశించాను. ఇక్కడ నేను నా ఆత్మకథను చెప్పుకోడానికి రాలేదు. కాని కార్మికోద్యమంలో నాకున్న అనుభవాల్నిమాత్రం తెలియజేస్తాను. 1923 లో జరిగిన ఆ బోనస్

తగాదాను పరిష్కరించడానికి ప్రభుత్వం హైకోర్టు జడ్జీలను మధ్యవర్తులుగా నియమించింది. (మధ్యవర్తుల్ని కోరుకోవడంలో కార్మికుల కెట్టి అధికారం లేదు.) కార్మికులకు బోనసు ఇవ్వడం అనవసరం అని ఆ 'పెద్దమనుషులు' తీర్పు జెప్పారు. తత్ఫలితంగా కార్మికులకు నూటికి 8 వంతులు ఆర్థికనష్టం కలిగింది.

ఇలాటి నిర్బంధ పరిష్కారాలకు అంగీకరించవద్దని మేము కార్మికులకు బోధించలేదు. కార్మికులే తమ స్వానుభవంద్వారా ఈవిషయాన్ని గ్రహించారు. "ఇతరుల్ని నమ్మకోగూడదు. ఎవరి కాళ్ళమీద వారే నిలబడాలి అనే గుణపాఠాన్ని కార్మికులు తమ జీవితానుభవంద్వారానే నేర్చుకున్నారు. తర్వాత 1925 లో చరిత్రప్రసిద్ధమైన సర్వవ్యాప్త సమ్మె జరిగింది. స్వదేశీవస్త్రాలమీద ఎక్సైజుపన్ను విధించడంవల్ల అసలు వస్త్రపరిశ్రమే పూర్తిగా దెబ్బతినే పరిస్థితి ఏర్పడింది. ఎక్సైజ్‌పన్నును భారతీయులందరు ఏకగ్రీవంగా ఖండించారు. ఈ పన్నును సాకుగా తీసుకొని యజమానులు కార్మికుల జీతాల్ని నూటికి 11½ వంతున తగ్గించారు. ప్రభుత్వం ఎక్సైజుపన్నును తొలగిస్తే కార్మికులజీతాల్లో ఈ తగ్గింపు ఉండదని యజమానులు హామీ ఇచ్చారు. కార్మికులు సమ్మెజేసి ప్రభుత్వాన్ని లొంగదీశారు. ప్రభుత్వం ఎక్సైజుపన్నును ఉపసంహరించుకుంది. యజమానులుకూడా కార్మికుల జీతాల్ని తగ్గించలేదు. 1925 లో ఈ సమ్మె జరక్కపోతే ప్రభుత్వం ఎక్సైజుపన్నును ఉపసంహరించుకొనేదా? కార్మికులు తమ సమ్మెహక్కును దురుపయోగపరిచారా? సదుపయోగపరిచారా? సమ్మెహక్కు ద్వారా కార్మికులు భారతీయ పరిశ్రమల్నే రక్షించారు.

1928 లో జరిగిన దీర్ఘకాల సమ్మె ఫలితంగా కార్మికులకు చాలా నష్టం కలిగిందనీ, ఈ సమ్మెకు కారణం కమ్యూనిస్టులే అని మంత్రిగారు సెల విచ్చారు. కాని అసలు జరిగిన విషయం ఏమిటి? డివేషా కమిటీ సూచించిన ప్రకారం కార్మికులుకూడా మానవుల్లాగా జీవించడానికి నెలజీతం రు 55 అయినా ఉండాలి. ఇప్పటికంటె ఇంకా రెట్టింపు ఎక్కువ పనిచేస్తేనే కాని కార్మికులకు ఈ జీతంరాదు. ఈతప్పుడు విధానంపోవాలని (రేషనలైజేషన్ అంటేకనీసజీతం కోసం ఎక్కువ పనిచేయడం) కార్మికులు తీవ్రంగా ఆందోళనచేశారు. ఉదాహరణకు బొంబాయిలోని ఒక మిల్లును తీసుకుంటాను. వెయ్యి మరకదుళ్ళకు 26 మంది చొప్పున ఈ మిల్లులో పనిచేశేవారు. వీరి సంఖ్య క్రమంగా 1927 లో 13.2 కు 1937 లో 10.63 కు తగ్గిపోయింది. కార్మికుల మొత్తం జీతపు

బిల్లుకూడా 1937 లో 600 కు 1938 లో 331 కి తగ్గిపోయింది. అంటే 26 మంది చేసేపని 10 మందే చేయవలసివచ్చింది. కార్మికులు నూటికి 50 మందికి పైగా నిరుద్యోగ సమస్యకు గురిఅయ్యారు.

కాబట్టి ఈతప్పుడు రేషనలైజేషన్ విధానాన్ని తొలగించవలసిందని కార్మికులు సమ్మెచేయడం అక్రమం అవుతుందా ? ఈసమస్యమీదనే 1928లో సమ్మె జరిగింది. ఈ సమ్మెఫలితంగానే ఈ రేషనలైజేషన్ విధానం తాత్కాలికంగానైనా (2 సంవత్సరాలవరకు) ఆగిపోయింది.

ఈసమ్మెవల్ల కార్మికులకు చాలా నష్టంకలిగిందని ప్రధాన మంత్రిగారన్నారు, అవును. న్యాయంకోసం పోరాడేటప్పుడు కొన్ని కష్టసుఖాలు తప్పవు. ఈసమ్మెల పోరాటాలవల్లనే కార్మికులు కొన్ని హక్కులైనా సంపాదించుకోగలిగారు. 1928 సమ్మెవల్ల కార్మికుల కనేకలాభాలుకూడా గలిగాయి. 1934 లో జరిగిన సమ్మెవల్లకూడా మంచిఫలితాలే వచ్చాయి. క్రూరనిర్బంధవిధానం ద్వారా ప్రభుత్వం ఈసమ్మెను అణచివేసింది. అయినప్పటికీ ఈసమ్మె ఫలితంగానే రోజుకు 9 గంటలుమాత్రం కార్మికులచేత పనిచేయించాలి అనే చట్టం వచ్చింది. సమ్మెద్వారానే కార్మికులీహక్కును సంపాదించుకోగలిగారు. కాని ప్రభుత్వానికి హృదయపరివర్తనం జరిగికాదు.

సక్లత్‌వాలా :—ప్రభుత్వం చట్టం చేయకపూర్వమే మేము [యజమానులు] బుద్ధిపూర్వకంగా 9 గంటలపని కంగీకరించాం.

డాంగే:—అవును. కార్మికులు సమ్మెద్వారా తీవ్రమైన ఆందోళన చేసినతర్వాత అంగీకరించేరు.

సమ్మెహక్కు లేకపూర్వం కార్మికుల పరిస్థితి క్రిమి కీటకాదులకంటెకూడా అన్యాయంగా ఉండేది. సమ్మెద్వారానే కార్మికులు కొన్ని సౌకర్యాల్ని సాధించుకో గలుగుతున్నారు. కార్మికులు సమ్మెజేయకుండా, ప్రాణాల్ని బలి ఇవ్వకుండా కార్మికులకు ఒక్క సదుపాయంకూడా కలగలేదు.

## సమ్మెహక్కు ఉండాలి

ఇలాంటి సమ్మెహక్కును రద్దుచేయడమంటే కార్మికుల జీవితాన్ని అధోగతిపాలు చేయడమన్నమాట ! కాళ్ళుచేతులు అంటగట్టి కార్మికుల్ని యజమానుల కాళ్ళముందు పడవేయడమన్నమాట.

కాబట్టి సమ్మెహక్కుకు ఎటువంటి హద్దులు ఏర్పరచగూడదు.

కాంగ్రెసు మంత్రివర్గానికి చిక్కులు కలిగించడానికే సమ్మెల్ని రెచ్చగొడుతున్నారు అని మామీద మరో నేరం ఆరోపింపబడింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1937 | లో సమ్మెజరిగిన | మొత్తంరోజులు | | 20 | లక్షలు |
| 1938 | ,, | ,, | ,, | 80 | ,, |
| 1939 | ,, | ,, | ,, | 40 | ,, |
| 1940 | ,, | ,, | ,, | 70 | ,, |
| 1941 | ,, | ,, | ,, | 30 | ,, |
| 1942 | ,, | ,, | ,, | 50 | ,, |
| 1943 | ,, | ,, | ,, | 20 | ,, |
| 1944 | ,, | ,, | ,, | 30 | ,, |
| 1945 | ,, | , | ,, | 30 | ,, |

ఈ లెక్కల్నిబట్టి చూస్తే ప్రజలచే ఎన్నుకోబడిన మంత్రివర్గాలున్నప్పుడే సమ్మెల తీవ్రతకూడా ఎక్కువ అవుతుందని తెలుస్తుంది. కాంగ్రెసు ప్రభుత్వం మీద కార్మికులకున్న ఉద్దేశమేమిటి ? ప్రజలచే ఎన్నుకోబడిన ప్రభుత్వం అనీ, ఇన్నాళ్ళనుంచీ తమకు వ్యతిరేకంగా ఉపయోగపడుతూవున్న ప్రభుత్వయంత్రం ఇక తమకు అనుకూలంగా ఉపయోగపడుతుందని కార్మికులు సహజంగా ఆశిస్తారు. అందువల్లనే రైతులు కార్మికులు తమ శత్రువులైన జమీందార్ల, పెట్టుబడిదార్ల దౌర్జన్యాల్ని అక్రమాల్ని ఎదుర్కోడానికి ధైర్యంగా ముందుకు వస్తారు. కాంగ్రెసు ప్రభుత్వమంటే రైతులకు కార్మికులకు ఉన్న అభిప్రాయమేమిటి ? రైతుపోరాటాలు కార్మికులపోరాటాలయెడల కాంగ్రెసుమంత్రు లవలంబిస్తూవున్న వైఖరిఏమిటి ? రైతుపోరాటాల్ని కార్మికపోరాటాల్ని అణచివేయడమేనా కాంగ్రెసుమంత్రుల కర్తవ్యం? ఫ్రాన్సు. ఇంగ్లాండ్ దేశాల్లోకూడా ఇలాగే జరిగింది. కాంగ్రెసును ప్రజలెందుకు బలపరచారో ఒకసారిగుర్తుకుతెచ్చుకోండి. ఆర్థిక పరిస్థితులు అధ్వాన్నంగా ఉండడంవల్లనే సమ్మెలు వస్తూవున్నాయి అని మీరు చెప్పిన సిద్ధాంతాన్ని మీరే మరచిపోకండి. కాంగ్రెసుమంత్రులకు చిక్కులు తెచ్చిపెట్టడానికి ఎవళ్ళో కొందరు రెచ్చగొట్టడంవల్లనే సమ్మెలు వస్తున్నాయి అనుకోడం శుద్ధపొరపాటు. 1928 లో ఏ కాంగ్రెసు ప్రభుత్వం లేకపోయినా ఆ సంవత్సరమే పెద్దపెద్ద బ్రహ్మాండమైన సమ్మెలు జరిగాయి అనే విషయం మరచిపోగూడదు. ఆ ఒక్క సంవత్సరం జరిగిన మొత్తం సమ్మె

రోజులు 310 లక్షలు. ఆ సంవత్సరం జరిగినన్ని సమ్మెలు మరెప్పుడూ జరగలేదు.

ఈ కొత్తచట్టం ప్రకారం అనేక గండకత్తెరలు దాటి బైటపడితేనేగాని కార్మికులు సమ్మెజేయగూడదు; ఈ తికమకలు లేకుండా సాఫీగా సూటిగా ఉండే ఒక మామూలు చట్టాన్ని ప్రవేశపెట్టమని మంత్రిగారికి సూచిస్తున్నాను. ఆ చట్టంలో సర్వసాధారణమైన ఈ సామాన్య హక్కులను అంగీకరిస్తే సరిపోతుంది,

1. కార్మికసంఘాన్ని గుర్తించడం.
2. సమిష్టిసంప్రతింపులద్వారా రాజీబేరాలు కొనసాగించుకోవడం.
3. ప్రమాదాలు జరగకుండా మిల్లులను ఎప్పటికప్పుడు తనిఖీ చేయడం.
4. కార్మికులు మిల్లు ఆవరణలో సభ్యత్వరుసుం వసూలుచేసుకోవడం.
5. సమ్మెజరగడానికి 7 రోజులకు ముందే నోటీసు యివ్వడం.

మీరు ఈ సామాన్యహక్కు అంగీకరిస్తేచాలు. ఇందువల్ల కార్మికులకు కనీసం సమ్మెచేసేహక్కు అయినా ఉంటుంది. కార్మికోద్యమం అభివృద్ధి చెందడానికి అవకాశం ఏర్పడుతుంది.

సమాజశ్రేయస్సుకోసం పారిశ్రామికాభివృద్ధికోసం, కార్మికవర్గ రక్షణ కోసం, కార్మికులకు సమ్మెహక్కు ఉండాలి. ఆ సమ్మెహక్కును రద్దుచేయడం మహాఘోరం అని తెలియపరుస్తున్నాను.

ఈ నాటికికూడా స్త్రీ కార్మికులకు ప్రసూతి సౌకర్యాలు అయినా కలిగించని కొన్ని రైల్వేబోర్డులున్నాయి. కార్మికులు సమ్మె చేయకుండా ప్రభుత్వం బుద్ధిపూర్వకంగా ఒక్కచట్టంకూడా చేయలేదు. ఈ దేశంలో కార్మికోద్యమం ప్రారంభమైన మొదటి రోజునుంచి నాకు అనుభవం ఉంది. అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సంస్థాపకుల్లో నేనొకణ్ని. మా హక్కుల్ని అంగీకరించకపోతే సమ్మెజేస్తాం అని కార్మికులు చెప్పినప్పుడే యజమానులు ఒకమెట్టు క్రిందకు దిగుతారు. ఇది నా స్వానుభవం. ఉదాహరణకు ఒక విషయం చెపుతాను. ఒకప్పుడు బాఖలేగారు ఒక సమ్మెను నడిపారు. ఈ బాఖలేగారు ప్రస్తుతం ప్రభువులసభలో (House of Lords) కూర్చున్నారు లెండి!

సమ్మె నడుపుతూ ఉన్న ఆ రోజుల్లో యజమానులు వీరితో సంప్రతించ నిరాకరించారు. అప్పుడు బాఖలేగారు యజమానులతో ఇలా చెప్పారు. "నాతో

సంప్రతించి ఇప్పుడు మీరు రాజీపడకపోతే ఏ మవుతుందో తెలుసునా? డాంగే వచ్చి ఈ సమ్మెను నడుపుతాడు. అప్పుడు కార్మికులు మీకు లొంగరు" అని యజమానులకు చెప్పాడు. ఈ మాటలు విని యజమానులు వెంటనే బాఖలేతో సంప్రతింపులు జరిపి రాజీ కుదుర్చుకున్నారు. కార్మికులు ఒక్క సమ్మెహక్కు ద్వారానే యజమానుల్ని లొంగదీయగలుగుతారు. సమ్మె సమయంలో కార్మికులు చూపే పట్టుదల, ఉత్సాహమే పెట్టుబడిదారుల్ని లొంగదీస్తుంది.

స్పీకర్ :— ఈ బిల్లుద్వారా కార్మికుల సమ్మె హక్కు హరింపబడదు. సమ్మె జేసే ముందు కార్మికులు కొన్ని పద్ధతుల్ని (కార్యక్రమం) మాత్రం అవలంబించవలసి ఉంటుంది.

డాంగే :— 'గౌరవనీయ' అధ్యక్షా! ఈ కార్యక్రమం, ఈ పద్ధతులు (ప్రొసీజర్) ఆచరణలో సమ్మెను అసాధ్యం చేయడానికే ఉపయోగపడతాయి. చట్టంలో 73 వ నిబంధన లేకపోతే మీరు జెప్పినమాట యధార్థమే అని నమ్ముతాను. 73 వ నిబంధనలో కోర్టు పరిష్కారానికి కార్మికులు అంగీకరించాలి అని ఉంది. ఈ నాడున్న కోర్టులు యజమానుల్ని త్రోసిపుచ్చి కార్మికుల కనుకూలంగా తీర్పులు జెప్పుతాయా?

ఇంతటితో ఈ విషయాన్ని ముగించి చట్టంలో ఉన్న తదితర విషయాల్ని గురించి మాట్లాడతాను. ప్రస్తుతం ప్రధాన విషయాల్ని గురించి మాత్రమే మాట్లాడి తర్వాత సెకండ్ రీడింగ్‌లో విపులంగా చర్చిస్తాను.

## లేబరు ఆఫీసర్ని తీసివెయ్యాలి

చట్టంయొక్క రెండో అధ్యాయంలో సమ్మె జేసేముందు కార్మికులు చేయవలసిన కర్మకాండ అంతా లేబర్ ఆఫీసరు, కన్సీలియేటర్, ఆర్బిట్రేటర్, లేబర్‌కోర్టు, ఇండస్ట్రియల్ కోర్టు వగైరా వివరింపబడింది. శాంతి-భద్రతలు కాపాడే పోలీసులు వగైరా-అసలు ప్రభుత్వయంత్రాన్ని ఇందులో పేర్కొనలేదు. ఈ అట్టహాసమంతా దేనికి? పరిశ్రమలకు సంబంధించినంతవరకు రెండేరెండు తరగతులున్నాయి. ఒకవైపు యజమానులు, మరోవైపుకార్మికులు. యజమానుల చేతుల్లో పరిశ్రమలకు సంబంధించినంత వరకు సర్వాధికారాలున్నాయి. కార్మికుల చేతుల్లో సంఘశక్తి మినహా మరే అధికారం లేదు ఈ లేబర్ ఆఫీసరు చేసేపని ఏమిటి? ఈ ఉద్యోగి పుట్టుపూర్వోత్తరాలేమిటో ఇదివరకే చెప్పాను. ఈమహాశయుడు ఇదివరకు అనేక పరిష్కారాల్లో వ్యవహా

రాల్లోపాల్గొన్నాడు. లేబర్ ఆఫీసరు, లేబర్ క్లాసుకు ప్రతినిధిగా వ్యవహరిస్తాడని ప్రతివాడు ఆశిస్తాడు. కాని వాస్తవంగా జరుగుతూన్న దేమిటి? యజమానుల చేతుల్లో ఇతనొక కీలుబొమ్మలాగా ఉపయోగపడుతున్నాడు. కార్మికోద్యమాన్ని అణచివేయడానికి అన్నివిధాల ప్రయత్నిస్తున్నాడు కార్మిక శ్రేయస్సును కోరే ప్రతివాడూ ముందు ఈ ఆఫీసరును సాగనంపడానికి తోడ్పడాలి కార్మికులకు సంబంధించిన ప్రతి విషయంలో పాల్గొనడానికి ఈ ఉద్యోగికి అధికారం ఉంది. ఇతని వ్యవహారం ఎలాఉంటుందో తెలియపరచడానికి ఒక ఉదాహరణఇస్తాను. కార్మికులకు కరువుభత్యం ఇవ్వడాన్ని గురించి బొంబాయి వస్త్రపరిశ్రమల్లో వచ్చిన తగాదాలో ఈ మహానుభావుడే ప్రత్యక్షమయ్యాడు. కార్మికుల తరపున కార్మికసంఘం, మంత్రిగారి కార్మికసంఘం (మజుదూర్ మహాజన్) కూడా హాజరయ్యాయి. లేబర్ ఆఫీసరు ఒక రేటు సూచించాడు. మేం ఒకరేటు సూచించాం. మంత్రిగారి కార్మికసంఘం మరోరేటు సూచించింది. ఈమూటిలో లేబరు ఆఫీసరు సూచించింది అన్నిటికంటె తక్కువరేటు, విచారణకు (ఎంక్వైరీ) అధ్యక్షత వహించిన జడ్జిగారి అభిప్రాయం వేరే చెప్ప నవసరం లేదు. పెట్టుబడిదారీ సమాజంలో న్యాయాధిపతుల న్యాయాన్ని గురించి ఎక్కువగా జెప్పడం అనవసరం పెట్టుబడిదారుల తరపున చెప్పే సాక్ష్యం లోని ప్రతిఅక్షరం సత్యంగానే భావింపబడేది. సాక్ష్యం జెప్పడానికి పెట్టుబడిదారు వస్తే అతనికి ఆదరపూర్వకంగా కూర్చోవడానికి ఒక కుర్చీ ఇచ్చి మర్యాదజేసేవాళ్లు. ఇక కార్మికుడువస్తే అతనికి కూర్చోడానికి కుర్చీ ఇచ్చేవాళ్ళు కాదు. ఈ కుర్చీల విషయంకూడా మేము పోట్లాడవలసి వచ్చేది. కార్మికుడు చెప్పేదంతా అబద్ధంగానే పరిగణించేవారు. అవును! పెట్టుబడిదారు 6 కోట్ల రూపాయల కధిపతి. కార్మికుని సంపాదనో, రోజుకు 6అరణాలేగా! ఈ నిరు పేద మొర పెట్టుబడిదారీ కోర్టుల్లో ఆలకించేదెవడు? కన్సీలియేటర్‌గానీ, ఆర్బి ట్రేటరు (మధ్యవర్తి) గానీ లేబరు ఆఫీసరు (ఇతను పేరుకుమాత్రం కార్మిక ప్రతినిధి) చేసే ప్రతి సూచనను ప్రభుత్వ సూచనగానే తీసుకునేవాళ్ళు. ఒక వేళ లేబర్ ఆఫీసరు నిజమైన కార్మిక ప్రతినిదిగా వ్యవహరించాలనుకున్నా అం దుకు ప్రభుత్వం అంగీకరించదు. కాబట్టి ఈలాటి లేబర్ ఆఫీసరును 'కార్మిక ప్రతినిధి' అని పిలవడం కేవలం పరిహాసాస్పదం . కార్మికశాఖా మంత్రిగారు కావాలనుకుంటే ఇతన్ని తన సలహాదారునిగా నియోగించుకోవచ్చు. కాని ఇతడు కార్మికుల వ్యవహారాల్లో మాత్రం ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకో

గూడదు. తనకు సలహాలివ్వడంకోసం కార్మిక మంత్రిగారు ఎంతమంది లేబర్ ఆఫీసరులను నియమించుకున్నా మాకేమీ అభ్యంతరములేదు. కార్మిక మంత్రిగారి ఆధ్వర్యంక్రింద నడుస్తూవున్న యూనియన్‌కూడా లేబర్ ఆఫీసరుకు అనవసర అధికారాలు అధికంగా ఇవ్వబడ్డాయి అనే అభిప్రాయాన్నే వెలి బుచ్చింది. కార్మికుల తరపున ప్రాతినిధ్యం వహించడానికి మీమజుదూర్ మహా జన్‌లాంటి సంఘాలుండగా ఇంకా ఈ లేబరు ఆఫీసరెందుకు ? కార్మిక సంఘా లున్నచోటనైనా కనీసం ఈ లేబర్ ఆఫీసరు జోక్యం కలిగించుకోకుండా ఉండాలి. కార్మికశాఖా మంత్రిగారితో నేను మామూలుగా వ్యక్తిగతంగా మాట్లాడి నప్పుడుకూడా ఇదే విధంగా సూచించాను. కాని మంత్రిగారు ఇందుకు అంగీక రించినట్లు కన్పించలేదు. ఇప్పటికైనా ఈ చట్టాన్ని సవరించమని మళ్ళీ కోరు తున్నాను. గత 8 సంవత్సరాలనుంచి ఈ లేబర్ ఆఫీసరు కార్మికోద్యమానికి ఆజన్మ శత్రువుగా ప్రవర్తించాడు.

ఈ బిల్లులో కార్మికుల తరపున ప్రాతినిధ్యం వహించడానికి రిప్రజెంటే టివ్ యూనియన్సు, క్వాలిఫైడ్ యూనియన్సు, ప్రైమరీ యూనియన్సు అప్రూవుడ్ యూనియన్సు ఎలక్టెడ్ రిప్రజెంటేటివ్ యూనియన్సు వగైరా అనేక యూనియన్లు సూచించారు. కార్మికుల సమావేశాల్లో తమ తరపున ప్రతి నిధుల్ని ఎన్నుకోడానికి వోటర్ల సంఖ్య నిర్ణయించే ఒక స్పష్టమైన విధానం ఇంతవరకు ఏదీలేదు. ఈ విషయంలో లేబర్‌ఆఫీసరు మిల్లుయజమానుల చెప్పు చేతల్లో జోహుకుంలాగా ప్రవర్తించిన ఉదాహరణలు రికార్డులోనే అనేకం ఉన్నాయి. పారిశ్రామిక తగాదాల్ని పరిష్కరించడానికి ఈ లేబరు ఆఫీసరే ఒక మధ్యవర్తిగా తయారవుతాడు. ఇతనికి అసలు కార్మికులతో ఉన్న సంబం ధము ఏమిటి ? యజమానుల, కార్మికులమధ్య ఇతనెందుకు జోక్యం కలిగించు కోవాలి ? ఇది పెట్టుబడిదారుల కుతంత్రం తప్ప మరేమీకాదు. కార్మికోద్య మాన్ని అణచివేయడానికి పెట్టుబడిదారులకు ఏదో ఒక ఆయుధం కావాలి. కాబట్టే పెట్టుబడిదారులు ఈ లేబరు ఆఫీసరును సృష్టించారు. బొంబాయిలో 60 మిల్లు లలో పనిచేసే కార్మికులు తమ ప్రతినిధుల్ని ఎన్నుకుంటారు. ఆ ఎన్నికల్లో కూడా ఈ ప్రబుద్ధుదే ప్రత్యక్షమవుతాడు. కనీసం కార్మికసంఘాలు సక్రమంగా పనిచేస్తూవున్న ప్రదేశాల్లోనైనా ఈ లేబరు ఆఫీసరుకు స్వస్తిచెప్పాలి.

యజమానుల, కార్మికులమధ్య సామరస్యం కుదిరించడానికి ఈ లేబర్ ఆఫీసరు ఉపయోగిస్తాడంటారా ? అయితే ఇంక యజమాన్లు ఎందుకు ? ఆపరి

స్థితుల్లో కార్మికశాఖామంత్రిగారు తమను, తమ సంఘాన్నికూడా ఎత్తివేసు కోవాలి. ఇదంతా పెట్టుబడిదారులు ఆడిన మాయానాటకం. ఒక్క పెట్టుబడి దారీవర్గానికే ప్రాతినిధ్యం వహించడానికి మంత్రిగారు ఇక్కడ కూర్చున్నారా? లేబర్ ఆఫీసరే కార్మికుల కష్టాల్ని తొలగించగలిగితే ఇంకా మనకు ఈసంఘా లెందుకు? చందాలు వసూలుచేయడం ఎందుకు? అహోరాత్రులు మనం ఈ అవస్థలన్నీ పడటం ఎందుకు?

రిపోర్టులు పంపించే బాధ్యత ఈ లేబర్ ఆఫీసరుకు ఇవ్వబడింది. కార్మిక మంత్రిగారికి రిపోర్టర్లు కావలసివస్తే ఆయన యిష్టంవచ్చినంత మందిని వేసుకో మనండి. మాకేమీ అభ్యంతరంలేదు. ఆ వ్యవహారం ఆర్థికశాఖామంత్రికి, కార్మిక శాఖామంత్రికి సంబంధించిన విషయం. కాని ఈ లేబర్ ఆఫీసరును తీసుకొచ్చి జబర్దస్తీగా కార్మికుల నెత్తిమీద రుద్దడం మాత్రం పనికిరాదు. ఇది మంత్రిగారు చెప్పే ధర్మసూత్రాలకే వ్యతిరేకమైన సిద్ధాంతం.

ఈ చట్టం ప్రకారం కార్మికులకు సూటిగా యజమానులతోనే సంప్రతించ డానికి అధికారం లేదు. వారు ముందు లేబర్ ఆఫీసరుకు తెలియజేయాలి. (ఈ అర్చకుడు అంగీకరిస్తేనేకాని దేవుడి దర్శనం కాదు;)

కార్మికులు తమ ప్రతినిధుల్ని ఎన్నుకోవచ్చునని ఈ చట్టంలో ఉంది. కాని ఎన్నికలు జరిగేవిధానం ఎలా (పక్షపాతంగా) ఉందోచూడండి! యజ మాని నోటీసిస్తే మూడురోజుల్లోనే ఎన్నికలు జరగాలట! మరి కార్మికులు నోటీసు ఇస్తేనో లేబర్ ఆఫీసరు ఇష్టం. ఒక కాలనిర్ణయం లేదు. అతని చిత్తం వచ్చినప్పుడు జరపవచ్చు. ఈ రూలును వెంటనే చట్టంలోనుంచి తొల గించివేయాలి. ఒకసారి ఎన్నుకున్న తర్వాత సంవత్సరాంతంవరకు అతన్ని మళ్ళీ తొలగించడానికి వీల్లేదని చట్టంలో ఉంది. ఇందువల్ల యజమానులు కొందరు ప్రతినిధులకు ధనాశచూపి లోబరచుకోవచ్చు. యజమానుల్లో కలసి పోయిన ప్రతినిధుల్ని తొలగించి మళ్ళీ కొత్త ప్రతినిధుల్ని తమ తరఫున ఎన్నుకోడానికి కార్మికులకెట్టి అధికారం ఇవ్వబడలేదు. చట్టంలో పేరుకు ఇలాంటి అవకాశంకూడా ఒకటిచూపబడింది. కాని ఆచరణలో ఇదిసాధ్యంగాదు. ఈ చట్టంలోనే ఇందుకు అనేక అవాంతరాలు (తేదీలు నియమాలు వగైరా) కల్పించబడినాయి. ఏ చిక్కూ లేకుండా తమ ఇష్టంవచ్చిన ప్రతినిధుల్ని ఎప్పుడైనా ఎన్నుకోడానికి కార్మికులకు అధికారం ఉండాలి. తాము తయారు

జేసిన చట్టంలో రూల్సు - తేదీలు తమకే గుర్తులేక మంత్రిగారే తికమకపడు తున్నారు. బహుశా వారికి పని ఎక్కువయిందేమో !

రిప్రెజెంటేటివ్ (ప్రాతినిధ్యం గల) యూనియన్నును కూడా గుర్తించి నట్లు ఈ చట్టంలో ఉంది. కాని నోటీసు లందించడం మినహా ఈ యూని యన్లకు ఈ చట్టంలో ఎట్టి అధికారం ఇవ్వబడలేదు.

ఇక కన్సీలియేటర్‌ను తీసుకుందాం. తగాదాల్ని పరిష్కరించడంలో ఇష్టం వచ్చినట్లు వ్యవహరించడానికి ఈ చట్టంలో ఇతనికి అధికారం ఇవ్వ బడింది. ఇతనుచేసే పనేమిటి ? నోటికివచ్చినట్లు కార్మికుల్ని బూతులుతిట్టడం, కాళ్ళూ చేతులు అంటగట్టి కార్మికుల్ని యజమానుల కాళ్ళముందు పడవేయడం, కార్మికులమీద తప్పుడు రిపోర్టులు కల్పించి రాయడం. ఇవేగా ఇతను చేసే పనులు ? కార్మికుల్ని చూస్తే నిప్పులు దొక్కిన కోతిలాగా ఎగిరిపడతాడు. అతను చెప్పిన దానికి కార్మికులు అంగీకరించకపోతే కాల్పులు చేయిస్తానని బెదిరిస్తాడు. ఈ 'కాల్పుల్ని' గురించి మేము రిపోర్టుచేస్తే 'అవన్నీ అధికా రులు చెప్పే మాటలు' అని సమర్థించుకుంటాడు. ఈ బూతు లేమిటయ్యా అంటే ఎబ్బే ! మరేం లేదు. "సమరయూఇంగ్" (కార్మికులకు నచ్చజెపుతు న్నాను.) అని మెల్లగా తప్పుకుంటాడు. ఈ చట్టం ఇలాంటి దారుణ చర్యల్ని కూడా నిరోధించడల్లేదు. కాబట్టి కన్సీలియేటర్ ఇష్టాన్ని చట్టంలో నుంచి వెంటనే తొలగించవలసిందని కోరుతున్నాను.

ఉభయపక్షాల్లో (యజమానులు - కార్మికులు) యెవరు నిరాకరించినా లొంగదీయడానికే ఇరువురిమధ్య ఒక సమాధానకర్త (కన్సీలియేటరు) అవ సరం అవుతాడు. కాని ఆచరణలో ఈ సమాధానకర్త కార్మికుల్ని లొంగదీయ డానికే ఉపయోగిస్తాడు. ఈవిధంగా లొంగదీయడంద్వారా కార్మికుల కెప్పుడూ అన్యాయమే జరుగుతూంది. కన్సీలియేషను (సమాధానం కుదిరించే) చట్టంలో ఒక కాలనిర్ణయం ఉన్నప్పటికీ ఆచరణలోమాత్రం ఎప్పుడూ వాయిదాలు వేయ డమే జరుగుతోంది. కన్సీలియేటర్ ఉభయపక్షాలమధ్య సమాధానంకోసం ప్రయత్నించడం నెలరోజుల్లోనే అయిపోవాలని ఈ కొత్త చట్టంలో ఒక క్లాజు చేర్చారు. ఇదివరకున్న రెండుమాసాల గడువును ఒక మాసానికే తగ్గించడం మంచిదే. కన్సీలియేటర్ ఒక నెలకంటె ఎక్కువ టైము తీసుకోగూడదు. కాని ప్రభుత్వంమాత్రం ఎంత టైము అయినా - మరొక రెండుమాసాలయినా - తీసు కోవచ్చు అని ఈ చట్టంలో వుంది.

నందా :— అవును. ఉన్నమాటే నిజమే. కాని ప్రభుత్వం తనకున్న యీ అధికారాన్ని తరుచుగా ఎప్పుడు వుపయోగించింది ?

డాంగే :— తరుచుగా ఉపయోగించారా లేదా అనే సమస్యకాదు మనకు కావలసింది. ఉపయోగించడానికి అసలు యీ చట్టంలో అధికారం ఉందా ? లేదా ?

ఈమూడుమాసాల గడువు అయినా అసలుతగాదా ఆరంభమైనప్పటినుంచి లెక్కలోకి రావడంలేదు కార్మికులు తమ కోరికల్ని వెల్లడించినప్పటినుంచి తగాదా ప్రారంభం అయిందని ఈచట్టం అంగీకరించడంలేదు. యజమానులతో కార్మికుల సంప్రదింపులు ప్రారంభమైన మొదటిరోజునుంచి ఈ 'మూడుమాసాల గడువు' లెక్కించబడడంలేదు. కన్సీలియేటరుకు ఒక నెల గడువు ఇవ్వడం అనవసరం. ఈ గడువుల మూలకం గానే అనేకసమ్మెలు ఇదివరకు అక్రమ సమ్మెలుగా ప్రకటించబడినాయి. కాబట్టి ఈ 'గడువుల' కాలాన్ని తగ్గించాలి.

కన్సీలియేషన్ పూర్తిఅయిన తర్వాతకూడా రెండు మాసాలవరకు సమ్మెలారంభించగూడదని మరో నియమం ఈ కొత్తచట్టంలో ఉంది. ఇది మహా ఘోరమైన నిబంధన. మీ మజుదూర్ మహాజన్ సంఘ ప్రతినిధి అయిన మిష్టర్ ఖండూభాయి కన్సీలియేషన్ పూర్తిఅయిన తర్వాతనే సమ్మెకు నోటీసు యిచ్చాడు. కాని ఒకే తగాదాకు మళ్ళీ కన్సీలియేషన్ ప్రారంభించారు. ఈ విధంగా ఒకే తగాదాకు నాలుగుసార్లు కన్సీలియేషన్ జరిగింది. ఇలాటి తప్పులతడకతో కూడుకున్న చట్టాన్ని మీరు సర్వోత్తమమైన చట్టం అని పొగడడంలో అర్థమేమిటి ?

## ఎవరు మధ్యవర్తులుగా వుండాలి ?

ఇక ఆర్బిట్రేషన్ (మధ్యవర్తిత్వం) విషయం తీసుకుందాం. ఉభయ పక్షాలు తమ కిష్టంవచ్చిన మధ్యవర్తుల్ని కోరుకొని తగాదాల్ని పరిష్కారం చేసుకోడం మంచిదే. కాని మీరు పెట్టుబడిదారుల చేతుల్లో కీలుబొమ్మ అయిన ఒక మధ్యవర్తి చెప్పే పరిష్కారాన్ని బలాత్కారంగా కార్మికుల నెత్తిమీద రుద్దుతున్నారు. పోనీ ఈ మధ్యవర్తి పరిష్కారానికి అయినా ఒక గడువు ఉందా అంటే చట్టంలో అలాంటి దేదీలేదు.

స్పీకర్ :— మధ్యవర్తిపరిష్కారానికి ఈ చట్టంలో ఒక కాలనిర్ణయంలేనిమాట నిజమే కాని, ఈచట్టం 1940 ఆర్బిట్రేషన్ యాక్టుక్రిందనే పనిచేస్తుంది. 1940 యాక్టులో పరిష్కారానికి ఒక 'గడువు' ఉంది.

డాంగే :—ఎంతకాలం గడువు ?

స్పీకర్ :—మూడుమాసాలు.

డాంగే :—ఈ గడువును ఇంకా పొడిగించడానికికూడా ఈ చట్టంలో అవకాశం ఉందా ?

స్పీకర్ :—గౌరవనీయ సభ్యులైన డాంగే గారే స్వయంగా ఈచట్టాన్ని చదివి తెలుసుకోవాలి.

డాంగే :—మహాశయా, నేను మిమ్మల్ని క్రాస్‌పరీక్షచేయడంలేదు. ఈ రూల్సు అన్నీ నాకు తెలిసి ఉంటానికి నేను ఒక లాయరు నని మీరు భావించ గూడదు నే నడిగిన ప్రశ్నకు మీరు సమాధానం ఇస్తేసంతోషిస్తాను. 1940 యాక్టు ప్రకారం ఆ మూడు మాసాల గడువును ఇంకాపొడిగించే అవకాశం ఉందా ?

స్పీకర్ :—అవును ఉంది.

డాంగే :—అదే నేను కోరుతూ ఉన్న సమాధానం.

ఈగడువుల పొడిగింపుతో అనవసరకాలయాపన చేయకుండా ఖచ్చితంగా ఒక కాలనిర్ణయం చేయండి అని నేను కోరుతున్నాను.

ఇప్పుడు జరుగుతూఉన్న పరిష్కారాల్లో అంతూపంతులేని కాలయాపన జరుగుతూఉంది. ఇందుకు అనేక ఉదాహరణ లున్నాయి. బొంబాయిలోని ఒక మిల్లులో అక్రమంగా 31 మంది వర్కర్లను పనిలోనుండి తొలగించారు. ఈకేసు పరిష్కారానికి రెండున్నర సంవత్సరాల కాలం పట్టింది. క్రిందికోర్టు కార్మికుల కనుకూలంగా తీర్పు జెప్పింది. యజమానులు వెంటనే దీన్ని హైకోర్టుకు అప్పీలుచేశారు. హైకోర్టు యజమానులకనుకూలంగా తీర్పుజెప్పింది. ఈ కేసుజరుగుతూ ఉండగానే మిల్లుయజమాని చచ్చిపొయ్యాడు.

ఈ రెండున్నర సంవత్సరాలకాలం తొలగించబడిన కార్మికులగతి యేం కావాలి ? కాబట్టి తగాదాలు త్వరగా పరిష్కారంకావడానికి చట్టంలోనే మంచి కట్టుదిట్టాలు ఉండాలి.

ఇక యీ లేబర్‌కోర్టుల్లో తీర్పులు జెప్పడానికి కూర్చున్న పెద్దమనుషు లెవరో చూదాం. జడ్జీలు 'లా' లో మాత్రం పరీక్షలు ప్యాసైవుంటారు. కాని పరిశ్రమల్నిగురించి వీరికున్న జ్ఞానం సున్న. పారిశ్రామిక సమస్యలు తెలియకుండా వట్టి గవర్నమెంటు డిగ్రీలతోనే ఈ జడ్జీలు పారిశ్రామిక తగాదాల్ని పరిష్కరించబూనుకోవడం కేవలం హాస్యాస్పదం. అసలు తగాదా యేమిటో

అర్థం జేసుకోడానికే ఈ జడ్జీలకు యెన్నోరోజులు పడుతుంది. కోర్టుల్లోనే యీ జడ్జీలకు ఎన్నోరోజులు మేము బోధించవలసివచ్చేది. ఎంత బోధించినా అసలుసమస్య ఏమిటో వీళ్ళకుఅర్థమయ్యేదికాదు. ఉదాహరణకు 'సహాయకుల్ని' (చిన్నచిన్న పనులుచేసే Doffer boys) 20 మందికంటె తగ్గించకూడదని మేం చెప్పాం. 10 మంది చాలు అని యజమానులుచెప్పారు. జడ్జీలు అసలు సమస్య ఏమిటో అర్థంచేసుకోలేక చల్లగా తప్పుకునే మధ్యమార్గం ఆలోచించారు. 15 మంది సహాయకులు చాలు అని నిర్ణయించారు. కాబట్టి యిలాంటి జడ్జీలు యిచ్చే తీర్పులు కేవలం నిరుపయోగం. పారిశ్రామిక తగాదాల్ని పరిష్కరించడానికి పారిశ్రామిక సమస్యలు తెలిసిన జడ్జీలనే నియమించాలని నేను కోరుతున్నాను.

పైన పేర్కొన్న బలగం అంతా కార్మికోద్యమాన్ని అణచివేయడానికే ఉపకరిస్తూవుంది. ఇందువల్ల మేము యింకా ఎక్కువగా సమ్మెలు చేయడం, మీరింకా ఎక్కువగా కాల్పులు సాగించడం మాత్రమే జరుగుతుంది. అంతకు మినహా ఈ చట్టంవల్ల కార్మికులకు కలిగే లాభం మరేదీలేదు. ఇందువల్ల పారిశ్రామిక శాంతి ఏర్పడదని మరొకసారి చెప్పుతున్నాను.

కాని ప్రభుత్వంమాత్రం ఇదంతా కార్మికోద్యమాభివృద్ధి కోసమే చేస్తున్నాంఅని చెప్పుతూఉంది. మంత్రిగారి సిద్ధాంతాలేవేరు. కార్మికోద్యమాభివృద్ధిని గురించి మంత్రిగారికి కొన్ని ప్రత్యేకాభిప్రాయాలున్నాయి. కాని ట్రేడ్ యన్ చరిత్రలో ఒకే ఒకసిద్ధాంతంఉంది. కార్మికోద్యమం నిజంగా బలపడాలి అనుకుంటే కార్మికసంఘాల్ని వెంటనే యజమానులు గుర్తించేటట్లు చెయ్యాలి. అదొక్కటే కార్మికోద్యమాన్ని ముందుకు తీసుకుపోతుంది. 'యజమానులు తప్పకుండా కార్మికసంఘాల్ని గుర్తించాలి' అనే నింబంధన ఈచట్టంలో లేనే లేదు. 'కొన్ని రకాలయూనియన్లను యజమానులు గుర్తించాలి' అని 1938 చట్టంలోఉంది. కాని యజమానులు ఏరకపు యూనియన్నుకూడా గుర్తించలేదు. సంఘటిత కార్మికోద్యమం నూటికి 25 వంతుల సభ్యత్వంఉన్న యూనియన్లను మాత్రమే కార్మికులు రిజిష్టరు చేయించుకోగలిగారు. సంఘటితకార్మికోద్యమం ఉన్నప్పుడే మిల్లుయజమానుల్ని కార్మికులు లొంగదీయగలుగుతారు. అప్పుడే యజమానులు యూనియన్లను గుర్తిస్తారు. యూనియన్లు గుర్తింపబడాలంటే (రికగ్నిషన్) కార్మికులు తమ సంఘబలాన్ని అయినా ప్రదర్శించాలి. లేక ప్రభుత్వం యజమానులమీద ఒత్తిడియైనా తీసుకురావాలి. అంతకుమినహా యజ

మానులెప్పుడూతమ బుద్ధిపూర్వకంగా కార్మికసంఘాల్నిగుర్తించరు. కేంద్రశాసన సభలో డాక్టర్ అంబేద్కర్ కూడా యూనియన్లను గుర్తించాలంటూ ఒక చట్టాన్ని ప్రవేశపెట్టాడు. కాని ఇందువల్ల ట్రేడ్ యూనియన్లు కరెస్పాండింగ్ సొసైటీలుగా మారడం మినహా కార్మికులకు కలిగేలాభం ఏదీలేదు. ఎనిమిది సంవత్సరాల మీ బి. ఐ. డి యాక్టు పరిపాలనలో కార్మికమంత్రిగారు ఒక్క యూనియన్ను కూడా యజమానులచేత గుర్తింప చేయలేకపోయారు. మీరు ఇచ్చిన లెక్కల్లోనే ఈవిషయం స్పష్టంగా ప్రకటింపబడింది. అలాంటి బి. ఐ. డి. యాక్టు పునాదులమీదనే ఈ కొత్తచట్టాన్నికూడా తయారుచేశాం అని మంత్రిపుంగవులు ధైర్యంగా సెలవిచ్చారు. నూటికి 25 వంతుల సభ్యత్వం కష్టసాధ్యం అని మేం మొదటేచెప్పాం. అదినిజమేఅని రుజువయింది. కాబట్టే ఈబిల్లులో సభ్యత్వనియమం 25%నుంచి 15%కు తగ్గించబడింది. 15%కూడా చాలా ఎక్కువే- ఈ '15%' నియమంకూడా ఉద్యమాభివృద్ధిని అరికడుతుంది. ఈ సంఖ్యను ఇంకా తగ్గించాలి.

నందా :— దీన్ని ఇంకా తగ్గిస్తే మళ్ళీ ఇంకా తగ్గించాలని అడుగుతారు. ఈ తగ్గింపుకు అంతు ఎక్కడ ? చివరకు బహుశా 2%కే తగ్గించమంటారు కూడా.

డాంగే :— ఏడుగురు సభ్యులతోనే ట్రేడ్ యూనియన్ ఏర్పడుతుందనే విషయము మంత్రిగారికి తెలిసే ఉంటుంది. సరే, 5% కంటె ఇంకా తగ్గించవలసిందని మాత్రం మంత్రిగారిని అడుగను. ఇందుకు మీరంగీకరిస్తారా ?

## కార్మిక సంఘాలను గుర్తించాలి

మంత్రిగారు యూనియన్లను నాలుగు తరగతులుగా విభజించి కార్మికోద్యమాన్ని ఒక రొంపిగా తయారు జేసారు. బ్రిటిష్ ప్రభుత్వం ప్రజల్లో అనేక చీలికలు కలిగించింది. అదేవిధంగా ప్రస్తుతం మన మంత్రివర్యులు కార్మికోద్యమంలో చీలికలు కలిగిస్తున్నారు. ఈ చీలికలవల్ల కార్మికోద్యమం విచ్ఛిన్నమైపోతుంది. ఈ చీలికలూ, ఈ తతంగమంతా ఎందుకు ? కార్మికుల నెత్తినెక్కి పెత్తవంజేసే ఈ 'ఆఫీసరు'లందర్నీ వెంటనే లాగివేయాలి! ఈ కార్యభారంలో మగ్నమై మంత్రిగారు తమ స్వంత సంఘాన్నే మరచిపోతున్నారు. బి.ఐ.డి. యాక్టులో ఉన్న రికగ్నైజ్డ్ యూనియన్కు బదులుగా మంత్రిగారు

ఈ కొత్తచట్టంలో అప్రూవ్డ్ యూనియన్నను సృష్టిస్తున్నారు. ఈ అప్రూవ్డ్ యూనియన్నకు కొన్ని ప్రత్యేకాధికారాలు కూడా ఇస్తున్నారు. ఇదంతా ప్రజాస్వామికాన్ని ఖూనీచేయడానికే. మొత్తం 2 లక్షల 60 వేల కార్మికులుగల బొంబాయిలో నూటికి 15 వంతుల సభ్యత్వం ఉండే రిప్రెజంటేటివ్ యూనియనుకు ఏ మాత్రం అధికారం లేదు. కాని, ఏ మిల్లులోనైనా నూటికి 15 వంతుల సభ్యత్వం గల ప్రాథమికసంఘం ఉండి, అది ప్రభుత్వ మధ్యవర్తిత్వానికి అంగీకరిస్తే (అంటే, కాళ్ళూ చేతులు కట్టి కార్మికుల్ని ప్రభుత్వోద్యోగుల కాళ్ళముందు పడవేస్తే) దానికి ప్రత్యేక అధికారాలు ఉంటాయి.\ సహజసిద్ధమైన కార్మికుల సమ్మెహక్కును దెబ్బగొట్టడానికే ఈ నిబంధన తయారు చేయబడింది.

నందా :— యూనియన్లను తప్పకుండా గుర్తించవలసిందని యజమానుల మీద ఒత్తిడి తీసుక రమ్మంటారా ?

డాంగే :— అవును. యజమానులమీద తప్పకుండా ఒత్తిడి తీసుకరమ్మని కోరుతున్నాను. మీరెవరి తరఫున ప్రభుత్వ బాధ్యత వహించారు ? మీ ప్రభుత్వం రైతు కూలీ ప్రభుత్వమే అని చెప్పుకుంటున్నారే ! అలాంటప్పుడు కార్మికుల శ్రేయస్సుకోసం యజమానుల్ని మీరెందుకు లొంగదీయరు ? ఇందులో సిగ్గుపడవలసిన విషయం ఏముంది ? చెప్ప లేనుగాని, మిల్లు యజమానులతో లాలూచీ పడితే నేడు ఈ చట్టం ప్రకారం మంత్రిగారి స్వంత కార్మిక సంఘానికి (మజుదూర్ మహాజన్) కూడా మిల్లు ఆవరణలో అడుగుబెట్టే అధికారంలేదు. మిల్లు ఆవరణలో చందాలు రుసుములు వగైరా వసూలు చేయ గూడదు. మంత్రిగారి కార్మిక సంఘంమీద మిల్లు యజమానులకేమైనా ప్రత్యేక దయఉంటే ఉండవచ్చు. 1929 వరకు మిల్లు యజమానులే మంత్రిగారి సంఘానికి సభ్యత్వ రుసుం వగయిరా వసూలు చేసిపెట్టేవాళ్ళుకూడా.

ఖందూభాయి :— డాంగేగారు చెప్పింది అబద్ధం.

డాంగే :— కావాలంటే మీరు తయారుచేసిన రిపోర్టులనుంచే ఉదాహరణ లిస్తాను.

ఖందూభా యి :— మీరు పేర్కొన్న సంవత్సరం (1929) సరిగాదని నా అభిప్రాయం.

డాంగే :— సంవత్సరం అదికావచ్చు లేక మరొకటికావచ్చు. కాని అసలు నేను

చెప్పిన విషయంమాత్రం నిజమే అని మీరు ఒప్పుకుంటున్నారన్న మాటేగా.

బొంబాయిలో ఎవరో ఒకరు అప్రూవ్డ్ యూనియన్ను స్థాపించితే, ఆ యూనియనుకు ఈ చట్టంప్రకారం కొన్ని ప్రత్యేకాధికారాలివ్వబడతాయి. ఒక్క వస్త్ర పరిశ్రమలోనే ఇలాంటియూనియన్లు అరవైస్థాపించవచ్చు. వెయ్యి మంది కార్మికులు పనిచేస్తూవున్న ఇంజనీరింగ్ పరిశ్రమలో నూటికి 15 వంతుల సభ్యత్వంచొప్పున ఒక యూనియన్ స్థాపించబడితే దానికికూడా కొన్ని ప్రత్యే కాధికారాలివ్వబడతాయి. కాని పదివేల సభ్యత్వం ఉన్న పరిశ్రమల్లో నూటికి 15 వంతులచొప్పునే ఒక రిప్రజెంటేటివ్ యూనియన్ ఏర్పడితే దానికి ఏమాత్రం అధికారం ఉండదు, అంటే ఏమిటి? ఇది ప్రజాస్వామికాన్ని ఖూనీ చేయడం గాదా? రిప్రజెంటేటివ్ యూనియన్లకు ఎలాంటి అధికారాలుంటాయో వాటిని గురించి ఇందులో ఒక్క ముక్కకూడా లేదు. ఎటువంటి అధికారాలూ లేకుండా కార్మికసంఘాల్ని నిర్వీర్యంచేయడం అంటే మన మంత్రిగారి కొక సరదా. పోనీ, ఇక అప్రూవ్డ్ యూనియన్లకైనా ఎలాంటి అధికారాలున్నాయో చూదాం. అప్రూవ్డ్ యూనియన్లకు కొన్ని అధికారాలిచ్చినందుకు మిల్లు యజమానులు అభ్యంతరంజెప్పారు. అప్పుడు మంత్రిగారు మిల్లుయజమానుల కిచ్చిన సమాధానం ఏమిటి? "కొన్ని అధికారాలు ఇచ్చి పుచ్చుకోవడంమాత్ర మే జరిగింది. అంతకు మినహా మరేమీలేదు". మంత్రిగారిచ్చిన ఈ సమాధానానికి మిల్లుయజమాన్లు హృదయపూర్వకంగా అంగీకరించారు. అప్రూవ్డ్యూనియన్ను కిచ్చిన అధికారాలేమిటి? "ఈ సంఘాలు మిల్లు ఆవరణలోనే సభ్యత్వరుసుం వసూలుచేసుకోవచ్చు" ఇదికూడా ఒకపెద్ద అధికారమేనా? ఈచట్టం రాకపూర్వం ఎప్పుడో 1928 లోనే మేము మిల్లు ఆవరణలోనే చందాలు, రుసుములు వగైరా వసూలుజేస్తూ ఉండేవాళ్ళం. సంఘబలంవల్లనే అప్పుడు మే మీ హక్కును సాధించాం. మా అరెస్టులతర్వాతనే ప్రభుత్వం కార్మికులవద్దనుంచి ఈ హక్కును హరించింది. మిల్లు ఆవరణలో చందాలు వసూలు జేసికోనిచ్చి నందులకుగాను కార్మికులు తమ ప్రధానహక్కు లన్నిటిని వదులుకోవాలా? కార్మికోద్యమాన్ని బలపరచడం అంటే ఇదేనా? "అప్రూవ్డు యూనియన్లు తమ నోటీసులను మిల్లులోనే ప్రకటించుకోవచ్చు". ఇది మీరిచ్చే రెండో హక్కు. ఎటువంటి సమ్మెలూ, పోరాటాలూ లేకుండానే కాలేజీవిద్యార్థులుకూడా తమ నోటీసులను కాలేజీ నోటీసుబోర్డులోనే ప్రకటిస్తారు. ఇదికూడా ఒక

హక్కేనా అని అడుగుతున్నాను. మిల్లు ఆవరణలో రుసుములు వసూలు చేయడం, నోటీసు అంటించడం వగైరా సర్వసాధారణ హక్కులు ఇతర దేశాల్లో ప్రతి కార్మిక సంఘానికీ ఉంటాయి; ఈ స్వల్పవిషయాల కోసం కార్మికులు తమ ప్రధాన హక్కులన్నిటినీ వదలుకోవాలా ? పోనీ, ఇవన్నీ వదులుకొని సాధించే దేమిటయా అంటే సున్నకుసున్న. హళ్ళికిహళ్ళి. ఈ అప్రూవుడు యూనియన్నుకు మిల్లు యజమానులతో మాట్లాడడంమినహా, ఒడంబడిక కుదుర్చుకోడానికికూడా అధికారం లేదు.

ఈ చట్టంలో యూనియన్లను నాలుగు తరగతులుగా విభజించారు. ఈ నాలుగూగాక రిజిష్టర్డ్ యూనియన్ అంటూ మరొకటుంది. ఒక మిల్లులో ఒక యూనియన్‌నే రిజిష్టరు చేయాలని ఈ చట్టంలో మరొక నిబంధనకూడా కొత్తగా చేర్చారు. ఇదే ప్రజాస్వామికాన్ని హతమార్చడానికే చేర్చబడింది. ఒక సంఘంలో నూటికి 15 వంతుల సభ్యత్వం ఉండి, మరో సంఘంలో నూటికి 14 వంతుల సభ్యత్వం ఉన్నంతమాత్రాన దాన్ని రిజిష్టరు చేయడానికి వీల్లేదు. ఇందువల్ల ఒకదానికంటె ఒకటి ఎక్కువ సభ్యత్వం చేర్పించుకోవాలని సంఘాల్లో పోటీ ఏర్పడుతుంది. కాబట్టి ప్రతిసంఘాన్ని గుర్తించవలసిందిగా కోరుతున్నాను. బహుశా ఇందుకు మన మంత్రిగారంగీకరించరేమో ; ప్రజలందరికి పరమశత్రువయిన బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వంకూడా మూడు రకాల యూనియన్లను గుర్తించింది. బి. బి. సి. ఐ. రైల్వేలో మూడుసంఘాల యూనియన్లు పనిజేస్తూనేఉన్నాయి. ఒకటి మాసంఘం. రెండవది మంత్రిగారి పార్టీతో నడుపబడేది. మూడవది రాయిస్టుల సంఘం. ఈ మూడుసంఘాల యూనియన్లను గుర్తించడవల్ల బి. బి. సి. ఐ. రైల్వేలోపని ఆగిపోయిందా ? ఇప్పుడున్న యూనియనులనన్నిటినీ ప్రభుత్వం నిరభ్యంతరంగా గుర్తించాలి. ఏయూనియనులో చేరాలో, ఏయూనియనులో చేరగూడదో కార్మికులే నిర్ణయించుకుంటారు. ఇష్టమైతే ఆయూనియన్లన్నీ కలసి ఐక్యంగా పనిచేయవచ్చు. లేక విడివిడిగా పనిచేయవచ్చు. అది కార్మికులఇష్టం. అందులో ప్రభుత్వం యే విధంగాను జోక్యం కలిగించుకోగూడదు.

నందా :— అనేక సంఘాలుండడం వల్లనే ఇటీవల జరిగిన పోస్టల్ సమ్మెలో చాలా గందరగోళం ఏర్పడింది.

డాంగే :— గందరగోళం ఏర్పడడానికి వేరేకారణం ఉంది. పోస్టల్‌వర్కర్లను ప్రాతినిధ్యం వహించే యూనియన్ ఒకటి. బ్రిటిష్ ప్రభుత్వం చెప్పు

చేతల్లో నడిచే యూనియన్ మరొకటిఉంది. అందువల్లనే పోస్టల్ సమ్మెలో గందరగోళం ఏర్పడింది. కాబట్టి ప్రభుత్వం లేక మిల్లుయజమానుల చెప్పుచేతల్లో నడచుకునే యూనియన్లను ఈచట్టంలోనుంచి తొలగిస్తే నేను సంతోషిస్తాను.

నందా :— విదేశముల ధనసహాయంతో, విదేశీయుల చెప్పుచేతల్లో, నడుచుకునే సంఘాల్నికూడా తొలగించవచ్చునా ?

డాంగే :— తప్పకుండా తొలగించవచ్చు.

ఇక జాయింటుకమిటీల విషయం తీసుకుందాం. ఇవికేవలం నిరుపయోగంగా ఉన్నాయి. ఈ జాయింటుకమిటీలు యజమానుల చెప్పుచేతల్లో కీలుబొమ్మల్లాగా ఉపయోగపడే ప్రమాదంఉంది. యూనియన్లు పంపించే ప్రతినిధులమీద ఈకమిటీల మంచీ, చెడూ, ఆధారపడి ఉంటుంది.

ప్రస్తుతం అమలులోవున్న ప్రభుత్వ స్టాడింగు ఆర్డర్లుకార్మికుల్ని ఖైదీలగాను మిల్లుయజమానుని జైలరుగాను భావించి తయారుచేయబడ్డాయి. కార్మికులమీద యజమానులకు సర్వాధికారాలున్నాయి అనే, మనమంత్రిగారి అభిప్రాయంకూడా. 16 వ స్టాడింగు ఆర్డరు ప్రకారం యజమానులు తమఇష్టం వచ్చినప్పుడు మిల్లుల్ని మూసివేయవచ్చు. వస్తువుల్ని ఉత్పత్తిచేయవచ్చు, లేక మానివేయవచ్చు. ఇదేమిటని ప్రశ్నించగూడదు. మిల్లులు యజమానుల వ్యక్తిగత ఆస్తిగా పరిగణించ బడుతున్నాయి. మిల్లులమీద యజమానులకు సర్వాధికారాలున్నాయట ! ఒక వ్యక్తికిమాత్రమే ఉపయోగపడే చొక్కాలు వగైరా వస్తువులు వ్యక్తిగత ఆస్థిక్రిందకు వస్తాయి. కాని ప్రజలందరి లాభనష్టాలకు ఆధారభూతములైన మిల్లుల్ని వ్యక్తిగత ఆస్థిక్రింద పరిగణించడంలో అర్థమేముంది ?

సక్లత్‌వాలా :— మిల్లులు మా స్వంత ఆస్తిగాదు. మిల్లులమీద అందులోవి భాగస్థులందరికి అధికారంవుంటుంది. కాబట్టి మిల్లులుకూడా ప్రజలందరి ఆస్తి (పబ్లిక్ ప్రాపర్టీ) అనే అనుకోవాలి. మా యజమానులపని మిల్లుల్ని నిర్వహించడంమాత్రమే.

డాంగే :— పెట్టుబడిదారీ విధానం అంటే ఏమిటో మాకు బాగాతెలుసు. మిల్లుల్లోని భాగస్తుల్లో నూటికి 90 మంది పెట్టుబడిదారులే. కొద్దిపాటి పెట్టుబడిదారులముఠాయే నేడు మిల్లులమీద సర్వాధికారం చలాయిస్తూవుంది.

ఏదో ఒక సాకుజెప్పి మిల్లును మూసివేయడానికి యజమానికి అధికారాలున్నాయి. మిల్లల్లో ఏదైనా ఒక అపాయం (యాక్సిడెంటు) జరిగితే యజమాని మిల్లును మూసివేయవచ్చు. నష్టపడిన కార్మికునకు, లేక ఆ కార్మికుని కుటుంబానికి మిల్లు యజమాని ప్రతిఫలం ఇవ్వాలి అనే నియామకం ఈ చట్టములో లేదు. మిల్లు యజమానులు అనేకసార్లు బుద్ధిపూర్వకంగా అపాయాలు కలిగించిన కేసులుకూడా అనేకం ఉన్నాయి. ఉదాహరణకు అమల్నేరునే తీసుకోండి. ఈ మిల్లులో అపాయం కలిగేపరిస్థితి ఉంది అని మేం ముందే ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టరుకు తెలియజేశాం. అయినప్పటికి ఇన్‌స్పెక్టరు మిల్లును తనికీచేయలేదు. మిల్లు యజమానులు, ఇన్‌స్పెక్టర్లు కలిసి కుట్రలుచేసిన కేసులు అనేకం వున్నాయి. ప్రతిఫలం యివ్వకుండా యజమానులు తప్పించుకోడానికి ఈ స్టాండింగ్ ఆర్డర్సులోనే చాలా అవకాశాలున్నాయి. కాబట్టి అలాంటి ఆర్డర్లను చట్టంలోనుంచి వెంటచే తొలగించాలి. ఈ చట్టంలో సమ్మెలు లాకౌట్లు (యజమానులు మిల్లును మూసివేయడం) కూడా నిషేధింపబడ్డాయి. ఇందువల్ల యజమానుల్ని, కార్మికుల్ని కూడా ప్రభుత్వం సమానంగానే చూస్తూ వున్నట్లు పైకి కన్పడుతుంది. కాని యజమానులు యీ రూలునుంచి తప్పించుకోడానికి ఈ చట్టంలోనే కావలసినన్ని అవకాశాలున్నాయి. ఉదాహరణకు రత్లంలో ఏంజరిగిందో చూడండి: చిమ్నీ సరిగా లేదనే సాకుతో యజమాని మిల్లును మూసివేశాడు. ఈలాంటి తప్పుడు పద్ధతుల్ని అరికట్టడానికి కార్మికులకెటువంటి అవకాశాలు ఈ చట్టంలో యివ్వబడలేదు.

## ఈఅభివృద్ధి నిరోధక బిల్లును త్రోసిపారేయండి

స్టాండింగు ఆర్డరు 19 ఎ ప్రకారం యజమాని తన యిష్టంవచ్చిన కార్మికుని ఉంచుకోవచ్చు, లేక తన యిష్టంవచ్చిన కార్మికుని పనిలోనుంచి తొలగించవచ్చు. ఇండస్ట్రియల్ కోర్టులో ఈ రూలును గురించి నిర్ణయం జరిగేటప్పుడే నేను దీన్ని పూర్తిగా వ్యతిరేకించాను. మిల్లు యజమానుల తరపున మిస్టర్ కామ్‌దార్ వాదించాడు. ఇది మిల్లు యజమానుల జన్మహక్కు అని కామ్‌దార్ వాదన. ఇతని వాదననే జడ్జి వాదించాడు. 14 రోజులముందు నోటీసు ఇచ్చిగానీ, అసలు నోటీసు ఇవ్వకుండానేగానీ, యజమాని, కార్మికుని పనిలోనుంచి తొలగించవచ్చునని జడ్జి అభిప్రాయపడ్డాడు. అవును. ఈ పెట్టుబడిదారీ దోపిడినే సురక్షితంగా కాపాడాలి అనుకునే జడ్జి మరోవిధమైన నిర్ణయానికి ఎలావస్తాడు? యజమానుల్ని, కార్మికుల్ని సమానదృష్టితో చూడడం

అంటే ఇదేనా? యజమానుల ఇష్టాయిష్టాలమీదనే కార్మికులు ఆధారపడాలి అనే ఈ 19-ఎ. నిబంధనను పూర్తిగా తొలగించవలసిందని కోరుతున్నాను. ఈ నిబంధనలో ఆరుమాసాల వరకు ఎటువంటి మార్పులు కోరగూడదని ప్రస్తుతం ఉన్న బిల్లు 38 వ నిబంధనలో ఉంది. దీనికి మంత్రివర్యులు మరొక సవరణకూడా చేర్చబోతూఉన్నారు. క్రొత్తగా చేర్చే యీ సవరణ ప్రకారం ఆరుమాసాలు పోయి 12 మాసాలు అవుతుంది. ఇందువల్ల కార్మికుల్ని ఇది వరకున్నంటె కూడా ఇంకా ఎక్కువ గట్టిగా సంకెళ్ళలో బిగిస్తారు. కార్మికులకు, యజమానులకు సమానత్వం అని మాటలు చెప్పడం, క్రియలో కార్మికుల్ని యజమానులకు బానిసలుగా చేయడం, ఇదే యీ చట్టం చేసేపని.

21 వ స్టాండింగు ఆర్డరులో కార్మికుల 'చెడునడతను' గురించి చెప్ప బడింది. యజమానులీ నిబంధనను ఏవిధంగా అమలు పరుస్తారో అహమదా బాదులో మంత్రిగారికికూడా కొంత అనుభవమయ్యే ఉంటుంది. ఇందులో 14 రకాల చెడునడతలు ఉల్లేఖింపబడ్డాయి. వీటిప్రకారం నన్నుకూడా మిల్లు ఆవరణలోనుంచి బైటికి గెంటివేయవచ్చు. నాకుకూడా జరిమానా విధించవచ్చు. భగవంతుడా నీకొక సలాం. ఫ్యాక్టరీల బైటకూడా ఇలాంటి నిబంధనను అమలు పరచవద్దుసుమా! 'క్రమశిక్షణ (డిసిప్లిన్) నుల్లంఘించడం' అంటే ఏమిటో జైలురూల్సులోచాలాసార్లు అనుభవించాం. 'తిన్నగా నిలబడడం' కూడా డిసిప్లిన్‌కు వ్యతిరేకమే అవుతుంది. 'పనిలోతరుచుగా అనేకసార్లుఅశ్రద్ధచూపుతూ ఉండే కార్మికుని తొలగించవచ్చు అని చట్టంలో ఉంది. కాని 'అనేకసార్లు' అనేమాటకు యజమానుల అర్థమేమిటో చూశారా? ఒకసారిగాక రెండోసారి అశ్రద్ధ చూపితే అది యజమానులదృష్టిలో 'అనేకసార్లుగానే భావింపబడుతోంది. 'సెలవుబెట్టకుండా గైర్‌హాజరయినాసరే' కార్మికుని తొలగించవచ్చు. పది రోజులకు పైగా ఒక కార్మికుడు జబ్బుపడితే ఈ నిబంధనప్రకారం ఆ కార్మికుని తొలగించివేయవచ్చు. ఈలాటి రూల్సును అమలుపరిస్తే మంత్రిగారు స్వయంగా తలచుకున్నా యజమానుల దౌర్జన్యాన్ని అరికట్టలేరు.

'మార్పు'ల్ని గురించి ఈ చట్టంలో మరొక నిబంధన ఉంది. ఒక మిల్లు యజమాని కార్మికులకు ఒక నోటీసు ఇస్తే దానిని కార్మికులు సర్వవ్యాప్త సమస్యగా చేయవచ్చునట! ఒక మిల్లులోని కార్మికులు యజమానికి నోటీసుఇస్తే దానిని యజమానులందరూ సర్వవ్యాప్త (జనరల్) సమస్యగా చేయవచ్చునట! కాని ఒక మిల్లు కార్మికులు నోటీసిస్తే దానిని తదితర కార్మికులందరు సర్వ

వ్యాప్త సమస్యగా చేయగూడదట! ప్రజాస్వామికమంటే ఇదేనా? రాష్ట్ర ప్రభుత్వం తలచుకుంటే మాత్రం దానిని సర్వవ్యాపిత సమస్యగా చేయవచ్చు నట! ఈ అధికారమే కార్మికుల కెందు కివ్వగూడదు? కార్మికులందరూ తమకు బోనస్ ఇవ్వాలని ఏకగ్రీవంగా కోరుతున్నారు. 60 మిల్లులల్లో పనిచేసే కార్మికులందరు ఒకేసారి డిమాండ్ చేయాలంటే అన్ని మిల్లుల్లో ఎన్నికలు జరిగి ఉండాలి. అన్ని మిల్లుల్లో ఎన్నికలు జరిగేటప్పటికి 6 మాసాలకాలం పట్టింది. 60 మిల్లుల్లో ఎన్నికలు పూర్తిఅయ్యేటప్పటికి మొదట ఎన్నికలు జరిగిన మిల్లుయొక్క కన్సీలియేషన్ గడువు దాటిపోయింది. 60 మిల్లుల్లో పనిచేసే కార్మికులందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన సమస్యమీద కూడా అందరూ కలిసి ఐక్యంగా పనిచేయడానికి వీలులేకపోయింది. కార్మికులు యావన్మంది కలసి పనిచేయాలనడం అసాధ్యమైన విషయం. క్రిందటి చట్టంలో మిల్లు యజమాని 'ఇష్టానికి' వదలివేయబడింది. మిల్లు యజమాని నిరాకరిస్తే 60 మిలుల్లో ఎన్నికలు పూర్తిఅయ్యేదాకా కార్మికులు చేతులు ముడుచుకొని కూర్చోవాలిసిందే. దీనినే మీరు ప్రజాస్వామిక పరిపాలన అంటున్నారా? కార్మికులు ఐక్యంగా కలసి ముందుకురాకుండా ఉంటానికి ఈ నిబంధన బుద్ధి పూర్వకంగా తయారు చేయబడింది.

నందా :— మీరు తీసే అర్థం తప్పు.

డాంగే :— చాలాసంతోషం! మీతో వ్యక్తిగతంగాకలసి నేను ఈ విషయాన్ని గురించి మాట్లాడినప్పుడుకూడా నేనిదే అర్థంతో మాట్లాడాను. అప్పుడు మీరు నావాదన తప్పు అని చెప్పలేదే! పోనీ, కార్మికులందరూ కలసి పనిచేయడానికి 42 వ నిబంధనలో ఎక్కడ అవకాశంఉందో ఇప్పుడు చూపండి.

"అక్రమ సమ్మెలు, లాకౌట్లు (మూసివేతలు)" అనే 14 వ నిబంధనను గురించి కొంచం మాట్లాడుతాను. మంత్రిగారితో ప్రత్యేకంగా మాట్లాడి నప్పుడు నేనీ విషయాన్నిగురించి చెప్పాను. కాని అది ఇందులో చేర్చబడలేదు. 98 వ క్లాజు ప్రకారం యజమానులు అక్రమ పనులు చేయవచ్చు. కాని కార్మికులుమాత్రం అందుకు అసమ్మతిని తెలియ పరుస్తూ వెంటనే సమ్మె చేయకూడదు. కన్సీలియేషన్, ఆర్బిట్రేషన్ వగయిరా కర్మకాండ అంతా జరుపుతూ కూర్చోవాలి. ఆ కర్మ కాండ అంతా జరపకుండా కార్మికులు సమ్మెచేస్తే అది 'అక్రమ'

సమ్మె అవుతుంది. యజమానులు అక్రమంగా మిల్లులు మూసివేస్తే కార్మికులు బాధపడవలసిందేగా? తర్వాత మీ లేబరు కోర్టుల్లో యజమానికి జరిమానా వేయండి. వేయకపోండి. అంతకాలం కార్మికులు నష్టపడవలసిందేనా? యజమానులకు ఈ పెట్టుబడిదారీ కోర్టుల్లో సరియైన శిక్షలు చెప్పబడతాయా? కొద్దిగొప్ప జరిమానాలు వేస్తేమాత్రం యజమానులు లెక్కచేస్తారా? యజమానులు తమకు లాభసాటిగా ఉన్నప్పుడు ఎంత అక్రమ చర్యకైనా పూనుకుంటారు. ఉదాహరణకు ఔంపరేచరును (ఉష్ణత) హెచ్చించడమే తీసుకోండి. తన లాభం కోసం యజమాని అక్రమంగా ఔంపరేచరును హెచ్చించినా కార్మికులు సమ్మెచేయగూడదు, అలాచేస్తే అది 'అక్రమ' సమ్మె అవుతుంది.

నందా :—అలాంటి పరిస్థితుల్లో కార్మికులు పనిచేయడం మానివేయవచ్చు. అది సమ్మెకాదు. అదిఒక 'సంఘటితచర్య' మాత్రమే అవుతుంది.

డాంగే :—అది సమ్మెఅవుతుందో, లేక సంఘటితచర్య అవుతుందో నిర్ణయించేది లేబరుకోర్టు జడ్జీలు. ఆనిర్ణయం జడ్జీల దయా దాక్షిణ్యాలమీద ఆధారపడి ఉంటుంది. జడ్జీల దయారసం యజమానులమీద ప్రవహిస్తుందో, కార్మికులమీద ప్రసరిస్తుందో మాకు వేరే చెప్పనవసరం లేదు. అది మాకు బాగాతెలుసును.

కాబట్టి ఈబిల్లు సర్వవిధాల పూర్తిగా అభివృద్ధి నిరోధకమైన బిల్లు. ఇది సమాజాన్ని రక్షించదు. కార్మికుల్ని కాపాడదు. కాబట్టి ఈబిల్లునే రద్దుచేసి ఈ తికమకలేమీ లేకుండా కార్మికులకు హానికలిగించనటువంటి కనీసం ఒక సర్వసాధారణ బిల్లునైనా ప్రవేశపెట్టవలసిందని కోరుతో ఇంతటితో ముగిస్తున్నాను.



